తా॥ తర్వాత మార్గమధ్యమందున్న యడవియందు దొంగలు యీ ధనమును జూచి సేనలను కొట్టి ధనమును తీసికొని.

శ్లో॥ దుష్టబుద్ధిం ప్రిగృహ్యాథబబంధుఃకంఠపాదయోః ।
సమ్యక్సంతాడ్యతంత్యక్త్వా యుయుశ్చోరాయథాగతమ్ ॥

తా॥ తర్వాత దుష్టబుద్ధిని పట్టి మెడకు కాళ్ళకు అంటకట్టిన వారై విశేషముగా దెబ్బలు కొట్టిన వారై పిమ్మట యథాస్థానమును గుఱించి చోరులు వెళ్ళిరి.

శ్లో॥ ఏకాకీ నిర్ధనోభూత్వా మనసేతివ్య చింతయత్ ।
సత్యపూజామదృష్ట్వాఽహం మనాదృత్యత్వరాన్వితః ।
స్వదేశ గమనం కృతవాంస్తస్మా ద్దుఃఖం ప్రిజాయతే ।
ఇతి నిశ్చిత్య మనసా శపథం కృతవాం స్తదా ॥

తా॥ ఆ చోరులు పారిపోయిన తర్వాత ధనముపోయిన వాడై ఒంటరిగా నరణ్య మందుండుండి యిట్లుగా పలికెను. నేను సత్యదేవుని పూజనుజూడక స్వామిని తిరస్కరించిన వాడనయితిని. అందు వలన నిట్టి దుఃఖము సంభవించెనని నిశ్చయించి ఒకానొక ప్రతిజ్ఞను జేసెను.

శ్లో॥ మత్సైన్యం మద్ధనం సర్వం పునరాగత్యమాం విశేత్ ।
తదా విత్తాను సారేణ పూజయిష్యామి మాధవ ॥

తా॥ ఓ విష్ణుమూర్తి ! యెప్పుడు నా సేనయున్నూ, నా ధనముయావత్తును తిరిగి నాకు చేరునో తత్క్షణము నా సంపత్తునకు దగినటులు మీ పూజను చేయుదునని దుష్టబుద్ధి యనువాడు పలికెను.

శ్లో॥ ఇతి ప్రార్థనతో దేవోధస్య పాదాన్బంధసః ॥

తా॥ ఈ ప్రికారము ప్రార్థింప బడిన పిమ్మట సత్యనారాయణ మూర్తి దొంగల పాదములు కట్టివేసెను.

శ్లో॥ అస్మాకం పాదచలనం కిమర్థం నశ్యతిస్వయం ।
ఇతిచింతాం సమాపన్నా దదృశుర్ధన పేటికాః ॥

తా॥ దొంగలు చెప్పుచున్నారు మాకు కాళ్ళు కదులుట లేదు కారణము లేకుండా యెందుకై నశించు చుండెను, అని

యీలాగున దుఃఖము బొందినవారై ధనము గలపెట్టెలను జూచిరి.

శ్లో॥ తాసువృశ్చికసర్పాశ్చ స్థితాబుసబుసాయితా ।
పేటికాస్థధనంసర్వంచిత్రమంతరధీయుతాః ॥

తా॥ అట్టిపెట్టెలయందుండు ధనము అంతర్థానమై యుండెను. ఆపెట్టెల యందు తేళ్ళు, పాములు బుసబుస యని ధ్వని చేయుచున్నవై యుండెను. ధనమంతయు ఆశ్చర్యము కలుగునట్లు కనపడక పోయెను.

శ్లో॥ కిమిదంకస్యమాహాత్మ్యంమనోవాచామగోచరం ।
ధనినస్తస్యసామర్థ్యమితిచక్రుర్వినిశ్చయమ్ ॥

తా॥ ఇది యేమి, మనోవాక్కులకు దెలియని మాహాత్మ్యము యెవరిది యని విచారించి యీ మహాత్ము ధనాధిపతియైన దుష్టబుద్ధి యొక్క సామర్థ్య మని నిశ్చయించిరి.

శ్లో॥ ఐంద్రజాలికవిద్యాయాంసుదృఢస్సధనీకిల ।
అస్మాభిర్బహుధాపూర్వం మాయాభిజ్ఞఇతిశ్రుతః ॥

తా॥ దుష్టబుద్ధి యనువాఁడు యీద్రవ్యమున కధిపతి. ఇతఁడు ఇంద్రజాల విద్య యందు సమర్థుఁడని పూర్వకాలమందనేక మారులు మాచేత వినబడినవాఁడు

శ్లో॥ ద్రవిణంత్వీశ్వరోవేత్తి ప్రాణాఃకంఠగతాఃఖలు ।
ప్రాణాస్తిష్ఠంతిచేద్ద్రవ్యంసుసంపాద్యంపునఃపునః ॥

తా॥ ఆహా! ద్రవ్యమును దేవుఁడెఱుఁగును. ప్రాణములు పోవుచున్నవి. ప్రాణములు న్నిట్టయితే ద్రవ్యమును సుఖముగా తిఱిగి సంపాదింప వచ్చును.

శ్లో॥ ఇతినిశ్చిత్యమనసా దుష్టబుద్ధేర్దదుర్ధనమ్ ॥

తా॥ ఈప్రకారము నిశ్చయించి ఆధనమును దుష్టబుద్ధికిచ్చిరి.

శ్లో॥ పునర్లబ్ధాధనంసర్వం తత్రైవబహుభక్తితః ।
సత్యనారాయణందేవం పూజయిత్వాయథావిధి ।
దుష్టబుద్ధిస్తుసంతుష్టః స్వస్థచిత్తోఽభవత్తదా ।

తా॥ అప్పుడు ఈదుష్టబుద్ధి యనువాఁడు తిరిగి యాధనమును బొంది అరణ్యమందే శాస్త్రప్రకారము సత్యనారాయణ వ్రతము జేసి సంతోషయుక్తుఁడై యుండెను.

శ్లో॥ తతఃప్రయాణంకృత్వాసౌ దుష్టబుద్ధిర్మహాధనీ ।
శకటేస్వర్థమాదాయ తదాస్వనగరంప్రతి ॥

తా॥ పిమ్మట గొప్ప ధనికుడైన దుష్టబుద్ధి బండ్లతో ధనము తీసుకొని తన పట్టణమును గూర్చి వెళ్ళిన వాఁడాయెను.

శ్లో॥ గచ్ఛన్మార్గేదదర్శాసౌ వగాధాం మహతీంనదీం ।
తర్తుకామో దుష్టబుద్ధి స్సమాసీయత్వరాన్వితః ॥

తా॥ ఆ దుష్టబుద్ధి వెళ్లుచూ మార్గ మధ్య మందు లోతైన గొప్పనదిని జూచి దాటవలయునని కోరిక గలిగి తొందర గలవాఁడై ధనమును దీసి.

శ్లో॥ శకటస్థం ధనంసర్వం నావ్యామారోపయత్తతః ॥
సయ్యేచ బంధుభిస్సార్థం నావమారుహ్య గచ్ఛతి ॥

తా॥ ధనమును బండ్లనుండి తీసి పడవ యందుంచి తానును బంధువులతో కూడి పడవనెక్కి వెళ్ళుచుండెను.

శ్లో॥ ఏతస్మిన్నంతరేతత్ర సత్యనారాయణః ప్రభుః ।
జజ్ఞాస్తుస్తస్యహృదయం వృద్ధబ్రాహ్మణరూపధృత్ ॥

తా॥ నావయందు ధనమునుంచి దాటు కాలమందు సమర్థుఁడయిన సత్యదేవుఁడు దుష్టబుద్ధి యొక్క మనస్సును తెలిసికొను నిచ్ఛ కలిగి ముసలి బ్రాహ్మణ రూపమును ధరించినవాఁడై

శ్లో॥ తందృష్ట్వాబుద్ధింస మధురంశ్లక్ష్ణ మబ్రవీత్ ॥
బ్రాహ్మణోఽహం దరిద్రశ్చ సత్యనారాయణవ్రతమ్ ।
కర్తుకామోఽస్మిహేదుష్ట తదర్థమహమాగతః ।
మహ్యమిచ్ఛానుసారేణ దేయంకించిద్ధనం త్వయా ॥

తా॥ ఆ ముసలిబ్రాహ్మణుడైన సత్యదేవుఁడు దుష్టబుద్ధిని జూచి యీ దిగువ వాక్యమును యింపుగా మృదువుగా బలికెను. అది

యేమనఁగా నేను బ్రాహ్మణుఁడను ధనములేని వాడను. సత్యనారాయణవ్రతము చేయవలయునను కోరిక గల వాడను. ఓ దుష్టుడా! తాఁదినుటకన్న పరులకిచ్చుట యెక్కువ ఫలము గనుక ఆ కోరికను తీర్చుకొనుటకు వచ్చిన నా కొఱకు కొంచము ధనము నిమ్ము.

శ్లో॥ కించిన్మాత్రేణసంతుష్టో యాస్యేఽహమవిలంబితం ।
త్వద్దత్తేనధనేనైవ కరిష్యే వ్రతముత్తమమ్ ॥

తా॥ ఓ దుష్టబుద్ధీ! నీవిచ్చు ధనముచే నాకు సంతుష్టి కలుగునో లేదో యీ ధనము నింకొక రీతిగ వ్యయ పరచెద నేమో యను సందేహము వలదు. నీ విచ్చినంతతో సంతోషించి దానిచే సత్యవ్రతమును త్వరలో చేసెదను.

శ్లో॥ వ్రతేన తుష్టోభవవాం స్తవశ్రేయోవిధాస్యతి ।
ఇత్యుక్త వంతం తంవిప్రం దుష్టబుద్ధి ప్రహస్యచ ।
ఇదానీం నాస్తిమే విత్తం గచ్ఛ గచ్ఛ ద్విజోత్తమ ।
తతోవిప్రస్త దాకర్ణ్య విస్మిత స్తం జగాదహ ॥

తా॥ ఈ ధనమును గ్రహించి నే జేయు సత్యవ్రతముచే భగవంతుఁడు సంతోషించి నీకు మంచిని గలుగ జేయునని చెప్పిన యా ముదుసలి బ్రాహ్మణుని గూర్చి నవ్వి హాస్యముచేసి ఓ బ్రాహ్మణుడా! యిప్పుడు నా వద్ద ధనము లేదు. వెళ్ళు వెళ్ళుమని కఠినముగా పలికెను. పిమ్మట బ్రాహ్మణుఁడా వాక్యమును విని యేమి యీ దుష్టుడు ధనముండగా లేదని వచించి నాడను నాశ్చర్యము గలిగి తిరుగ నుత్తరమిచ్చెను.

శ్లో॥ శకటే ధనమాదాయ చాగతోఽసినాధిక ।
ఇమాంనదీం తర్తుకామో నౌకయా దృఢయాఽధునా ।
తదర్ధపేటికానావ్యాం నిక్షిప్తాః పశ్యతోమమ ॥
నాస్తీతి వచసం కష్టం తేనార్హతి భవాన్ధనీ ॥

తా॥ ఓ ధనమదాంధుడా! ధనమును బండ్లతో తెచ్చి నదిని దాటుటకు నేను చూచు చుండగా పడవ యందుంచిన దానిని లేదని

చెప్పుట యెంత కష్టము ? నీవు ధనవంతుడ వగుటచే దానము చేయుటకు తగినవాడవు

శ్లో॥ దేశకాలేచ పాత్రేచ దత్తమక్షయ మశ్నుతే ।
పాత్రోఽహంబ్రాహ్మణోరిక్తః పూర్ణిమా తిథిరుత్తమా ॥

తా॥ యోగ్యమయిన దేశమందు కాలమందు నిచ్చు ధనము సంపూర్ణ ఫలము నిచ్చునను న్యాయము కలదు. కనుక నేను దరిద్రుఁడనగు బ్రాహ్మణుఁడనగుటచే దానపాత్రుఁడను. శ్రేష్ఠమయిన పూర్ణిమా తిథియగుటచే కాలము కూడ యోగ్యమైనది గదా.

శ్లో॥ త్వద్దత్తేన కరిష్యామి సత్యనారాయణవ్రతం ।
సర్వంధనం యాచేఽహమల్పాన్మే ప్రీతిరుత్తమా ॥

తా॥ నీవు దానము చేసిన ధనముచే సత్యనారాయణ వ్రతమును జేసెదను. ధనమంతయు నాకక్కర లేదు. కొద్ది ధనము చేతనే మిక్కిలి సంతోషించెను.

శ్లో॥ రూపికాం వాతదర్ధంవా దేయం వాకణికాపివా ।
నోచేద్గచ్ఛామి తేస్వస్తి స్యాదన్యంయాచయామ్యహమ్ ॥

తా॥ ఒకరూపికనో, అర్ధరూపికనో, పావలానో యిప్పింపుము. అదియు లేదంటివేని నీకుమంగళము గలుగుగాత నేనన్యునియాచించెద.

శ్లో॥ తతో దుష్టజనో మత్తో హేలయాతం ప్రహస్యచ ।
విప్రవేషధరశ్చోర స్త్వధనం హర్తుమాగతః ॥

తా॥ బ్రాహ్మణుఁడీ రీతిని పలికిన పిదప ధనముగల దుష్టబుద్ధి నిర్లక్ష్యముచే హాస్యముచేసి బ్రాహ్మణ వేషముచే ధనమునపహరించుటకు వచ్చినావా యేమియని పలికెను.

శ్లో॥ మర్మభేదక వాక్యంహి దుష్టబుద్ధి రువాహచ ।
నిష్ఠురంచ వచశ్శ్రుత్వా సత్యనారాయణ ప్రభుః ।
నవీన రోష సంయుక్తశ్శ శాపకంఠినం తదా ॥

తా॥ పిమ్మట మర్మములను భేదించు నట్టి దుష్టబుద్ధి యొక్క కఠినవాక్యమును విని సమర్థుడయిన సత్యనారాయణ మూర్తి, యిది

వరలో నశించి తిరిగి యీ వాక్యమువల్ల సంకురించిన నూతనమయిన కోపముగలిగి కఠినముగ శాపమిచ్చెను.

శ్లో॥ దుష్టబుద్ధేఽతి మూఢ స్త్వం తవకష్టంభవిష్యతి ।
ఏవముక్త్వాత తశ్శీఘ్రం బ్రాహ్మణం కించిదంతరః ॥

తా॥ ఓ దుష్టబుద్ధీ ! నీవు మూఢుడవు. ఇట్లు హాస్యము చేయుటచే నీకతికష్టం గలుగు గాత అని శాపంబిచ్చి పిదప త్వరగా కొంచము దూరము వెళ్ళి చాటుననున్న వాఁడాయెను

శ్లో॥ నిర్గతే బ్రాహ్మణే సద్యో నౌర్మమజ్జజలేఽద్భుతమ్ ।
దుష్టబుద్ధిర్వేణు దండల సమాలంబ్య శనై శ్శనైః ।
నిమజ్యోన్మజ్జ్య తత్తీర మావిశ ద్ద్విజసత్తమాః ॥

తా॥ ఆ బ్రాహ్మణుఁడు వెళ్ళిన తోడనే పడవ మునిగెను. దుష్టబుద్ధ మాత్రము పడవతీయు వెదురును తీసికొని మునుగుచు తేలుచు నదియొడ్డునకు జేరెను.

శ్లో॥ విలప్య బహుధాతత్ర మూర్ఛాప్రాప్య స్మృతింతదా ।
అవశిష్టోఽహమేకోవా సర్వం ద్రవ్యం బలం సమం ।
నౌకయానహతో మేఽధః ప్రావిశన్మమకాగతిః ॥

**తా॥** ఆ నదీతీరమందు క్రిందపడి విలపించి దేహ స్మారకము తప్పినవాఁడై కొంతతడవునకు తెలివి తెచ్చుకొని నేనొక్కఁడను మిగిలితిని. ధనము బలము పడవతో గూడ నొక్కమారు నదియందు మునిగెను, నాకు దిక్కెవరని విచారించెను.

శ్లో॥ అహమేవంగృహంగత్వా కింభోక్ష్యే సుఖముత్తమమ్ ।

**తా॥** ఈ జగమున ధనమును బట్టియే భార్యాపుత్రాదులుప చారములు చేయుదురు, గాక అట్టి ధనమును విడిచి గృహమునకు వెళ్ళిన యేమి సుఖము ననుభవించెదను.

శ్లో॥ హాతాతతా తేతిమదస్కరాభ్యాముర స్సమావిధ్యపపాతభూమౌ।
మూర్ఛాంగతోధప్రతిపద్య సంజ్ఞామేవంవదన్నోకమవాపమూఢః॥

**తా॥** మూఢుఁడయిన యీ దుష్టబుద్ధి యెంత యాపత్కాల

మందయిన భగవంతుని తలచక నాయనా యనియే తలచు కొనుచు, చేతులచే నెత్తిని బాదు కొనుచు, నేడ్చుచు భూమిపై బడెను. అట్లు మూర్ఛిల్లి కొంతతడవునకు మేల్కాంచి యీ దిగువ నుదహరించు రీతిగ దుఃఖమును జెందెను.

శ్లో॥ అదన్కదన్నం కృపణేనవృత్త్యాపి బన్యవాగూం లవణేనహీనాం।
శ్రమేణవిత్తం సముపార్జితం యత్తదద్యనష్టం ప్రతికూలదైవాత్॥

తా॥ ఆ వాక్యములేవి యనిన దీనవృత్తిచే నతిథిపూజాధికము లేక సంచితమైన యన్నము భుజించి ఉప్పులేని గంజిత్రాగి కష్టముచే నార్జించిన ధనము నేటికి దైవానుగ్రహము దప్పి నశించెను.

శ్లో॥ మజ్జిష్యే౽జలేత్వద్య కింగృహం కిమువల్లభా।
లజ్జాంహిత్వా గృహంగత్వా కింకరోమ తతఃపరమ్॥

తా॥ నేనిప్పుడు జలపాతముచే మరణము నొందెదను. ధనము లేనిచో భార్యాగృహాదులుండియు నైహిక ప్రయోజన మేమియు లేదు. సిగ్గునువిడచి ధనహీనుడనై యిల్లుచేరి పిదప చేయుపని యేమి.

శ్లో॥ ఏవంచింతయ స్తస్య మతిరాసీత్తదోత్తమా।
యాచ్ఞార్థమాగతో విప్రోమయా సమ్యక్ప్రతారితః॥

తా॥ ఇట్లు విచారసాగరమందు మునుగుచు తేలుచున్న దుష్ట బుద్ధికి ఆ సముద్రము దాటుటకు తెప్పవలె నొక యుపాయము తోచినది. అదియేమనిన యిదిరలో యాచించుటకై వచ్చిన వేదపారగుడగు బ్రాహ్మణుని నేను మిక్కిలి తిరస్కరించితిని.

శ్లో॥ తస్మాదేతనహద్దుఃఖం జాతం తత్రన సంశయః।
విప్రవేషధరోనూనం సత్యనారాయణః ప్రభుః।
బ్రహ్మవాశం కరోవాస్యానోఽచే దేవంభవత్కథమ్॥

తా॥ ఆ బ్రాహ్మణుని తిరస్కరించిన మూలముగ యిట్లు గొప్ప దుఃఖము కలిగినది. ఈ బ్రాహ్మణ రూపుఁడగువాడు సత్యనారాయణమూర్తియో, బ్రహ్మయో, సాంబమూర్తియోయై యుండవలెను. లేకున్న యిట్లు పలికిన వెంటనే కష్టమెట్లు కలుగును.

శ్లో॥ తదన్యో బ్రాహ్మణః కర్తుం నశక్నోతి నసంశయః ।
అతస్త్వం శరణం యామి వాంఛితార్థప్రదో భవేత్ ॥

తా॥ అట్లు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో నొకరు గాకున్న నితర బ్రాహ్మణుడిట్లు కష్టము కలుగ జేయుటకు సమర్థుడు కాడు. సంశయము లేదు. కాన కోరిన కోర్కెలిచ్చు నాబ్రాహ్మణుని రక్షింపుమని వేడెదను.

శ్లో॥ క్షమస్వచాపరాధం మే యదుక్తం తవసన్నిధౌ ।
ఏవముక్త్వా పునర్నత్వా మహాశోకాకులోఽభవత్ ॥

తా॥ ఇట్లు మనస్సున నూహించిన వాడై పిదప యిదివరలో నీ వద్ద పలికిన దోషపు పలుకును క్షమింపుమని పలికి తిరిగి నమస్కరించి మిక్కిలి దుఃఖమును జెందెను.

శ్లో॥ తతాంతరే మహావిప్రో హ్యావిరాసీద్ధ సన్ముఖః ।
ప్రోవాచ వచనం విప్రో విలపన్తం ధనాధిపమ్ ॥

తా॥ అంతలో నా బ్రాహ్మణ శ్రేష్ఠుడు నవ్వుచు ప్రత్యక్షమాయెను. అట్లు ప్రత్యక్షమయి దుఃఖించుచున్న దుష్టబుద్ధిని గూర్చి ఈ దిగువ రీతిగా వచించెను.

శ్లో॥ మాశోచీ శ్రుణు మద్వాక్యం మమపూజాబహిర్ముఖః ।
మామవజ్ఞాయ దుర్బుద్ధే లబ్ధవాన్ దుఃఖమీదృశమ్ ॥

తా॥ ఓ దుష్టబుద్ధీ! నీవు దుఃఖించకుము. నా మాట వినుము. పూజచేయక నన్నవమానించుటచే నీ కిట్టి కష్టములు సంభవించెను.

శ్లో॥ వ్రతంకర్తుం ప్రతిజ్ఞాయ గృహంగత్వా తతఃకురు ।
సత్యనారాయణం దేవం మాంవిద్ధి కరుణానిధిమ్ ॥

తా॥ వెంటనే సత్యనారాయణ వ్రతము చేసెదనని పలికితివి. గాన యీ వ్రతము మీ గృహంబున జరుపుము, నన్ను దయా సముద్రుడైన సత్యదేవునిగ నెఱుంగుము.

శ్లో॥ త్వదభిప్రాయమాజ్ఞాతుం ప్రాదుర్భూత్వా సమాహితః ।
ఏతత్సర్వమహంకుర్వే మదన్యో బ్రాహ్మణో నహి ॥

తా॥ నేను నీ మనోగతమగు నభిప్రాయము తెలిసి కొనుటకు ప్రత్యక్షమై నా రూపమును తెలియపర్చక గంభీరుడనై యుంటిని. ఈ సమస్తమయిన కార్యజాతమును నేనే జేయు చున్నాను. నా రూపము బ్రాహ్మణ రూపముగా తెలిసికొనుము.

శ్లో॥ అజ్ఞాత్వామమ మాహాత్మ్య మనుభూతంత్వయాధునా ।
తచ్ఛ్రుత్వా భగవద్వాక్యం స్తోత్రం చక్రేప్రహృష్టధీః ॥

తా॥ ఓ దుష్టబుద్ధీ! నా మహత్తును తెలిసి కొనలేక యిట్టి కష్టముల ననుభవించితివని పలుకంగా నా వాక్యమునువిని సంతోషము కలవాడై స్తోత్రము చేసెను.

శ్లో॥ నౌరున్మమజ్జసబలా సధనా తత్క్షణాత్తతః ।
దుష్టబుద్ధి స్తదాదాయ బలం దివ్యం గృహం యయౌ ॥

తా॥ స్తోత్రము చేసిన వెంటనే బలముతో ధనముతో గూడ నావ తేలెను. దుష్టబుద్ధి సేనను నావను తీసుకొని యింటికి వెళ్ళెను.

శ్లో॥ అత్యుత్సాహ మనసః స్వ వ్రతం చక్రేయథావిధి ।
నిరోగం శుభమాయుష్యం సధనం ప్రాప్తవాన్సుఖమ్ ॥

తా॥ మిక్కిలి సంతోషముతో యింటివద్ద సత్యనారాయణ వ్రతము యథావిధిగ చేసెను. అట్లు చేయుటచే ధనము సమృద్ధి గలవాడయి రోగము లేకుండ నూఱు సంవత్సరములు ఆయుస్సు కలిగి సుఖమనుభవించెను.

శ్లో॥ పక్షేపక్షే వ్రతంచక్రే సానందో భక్తి సంయుతః ।
తదాది దుష్టబుద్ధిస్తు సబుద్ధి రితివిశ్రుతః ।
ఇహలోకే సుఖం భుక్త్వా సకళత్రస్సపుత్రికః ॥

తా॥ అదిమొదలు దుష్టబుద్ధి ప్రతిపక్షమందు భక్తి యుక్త మయిన యానందముతో సత్యనారాయణ వ్రతమును జేసెను. అట్లు చేయుటచే దుష్టబుద్ధి యనువాడు పూర్వనామము వదలి సుబుద్ధి యను పేరును బొందెను. ఈ భూలోకమందు భార్యాపుత్త్రులతో సమస్త సుఖముల ననుభవించెను.

శ్లో॥ సురపతి వరలోకే దేవతా సుందరీణాం ।
కుచతట పరిఘుష్టే నూనదళ ప్రవక్షాః ।
సకల సుర మునీ ద్రైస్సేవ్య మానస్సభాయాం ।
సకృత సుకృత భోగా న్దేవ రాజస్య భుక్తేః ॥

తా॥ దేహానంతరము స్వర్గ లోకమందు దేవతా స్త్రీలతో సంభోగము గలవాఁడై సమస్త మునులచే సేవించ బడువాఁడై తాను చేసిన పుణ్యముల చేత దేవలోకమందు దేవేంద్రభోగము ననుభవించెను.

ఇత్యష్టమోఽధ్యాయ స్సమాప్తః.

✲—✲—✲—✲—✲—✲

## అథ నవమోఽధ్యాయ ప్రారంభః

సూతః॥శ్లో॥ అథాన్యత్సం ప్రవక్ష్యామి సత్యనారాయణ ప్రభోః ॥
మాహాత్మ్యం సర్వపాపఘ్నం వక్తౄణాంశృణత్వామపి ॥

తా॥ ఇటు పిమ్మట చెప్పువారలకు వినువారలకు సమస్త పాపములను నశింప జేయు సమర్థుడగు సత్యనారాయణ మూర్తి యొక్క మఱియొక మహిమను చెప్పెదను.

శ్లో॥ అవంతికానామపురీ కాచిదస్తి మహీతలే ।
సర్వ సంపత్సమాయుక్తా సర్వసౌభాగ్య సంయుతా ।

తా॥ ఓ శౌనకాది మునులారా! భూతలమందు సమస్త సంపత్తులు గలదై సమస్త మంగళములు గలిగి నట్టి యవంతి యనునొక పట్టణము గలదు.

శ్లో॥ స్వాశ్రమాచార యుక్తానాం బ్రాహ్మణానాం వివేకినాం ।
క్షత్రియాణాం విశుద్ధానాం నీతిశాస్త్రాను గామినాం ।
అధఃకృత కుబేరాణాం వైశ్యానాం ధనసంపదా ।
బ్రహ్మశుశ్రూషణ ధియాం శూద్రాణాం శుద్ధచేతసాం ।

ఏ తేషాంస్థాన భూతాయాం పుర్యామాస్తే పతివ్రతా ॥

తా॥ తమతమ యాశ్రమచార సంపన్ను లయిన వివేకులగు బ్రాహ్మణులకును, నీతిశాస్త్రము ననుసరించి నడుచు పరిశుద్ధులయిన రాజులకును, విశేష ధనసంపత్తు గలవారై కుబేరుని తక్కువగా చూచెడు కోమట్లకును, చిత్తశుద్ధి గలిగి బ్రాహ్మణ పరిచర్యయందా సక్తి గల బుద్ధిమంతులగు శూద్రులకును యిట్టి నాలుగు వర్ణములకు నునికిపట్టయిన యా యవంతియను పట్టణ మందొకానొక పతివ్రత యయిన స్త్రీ కలదు.

శ్లో॥ కౌముదీతి ప్రసిద్ధాఖ్యా కౌముదీవ మనోరమా ।
పుణ్యశీలా దయామూర్తిః కాచిత్సాధ్వీ వణిక్సుతా ।
విష్ణుపూజా పరానిత్యం శివపూజా పరాసతీ ।
మాతాపితృ విహీనాచ పుత్రసోదర వర్జితా ।
అనింద్య కర్మణా కాల యాపనం క్రియతే సదా ॥

తా॥ ఆ పతివ్రత యయిన స్త్రీ కౌముది యను నామముచే ప్రసిద్ధి గలదై నామమునకు సార్థకముగా వెన్నెల వలెనే ఆహ్లాదము చేయునదై పవిత్రమయిన స్వభావము గలదై దయా యుక్తురాలై పతివ్రతయై యొకానొక వర్తకుని కుమార్తె యైన శివవిష్ణ్వారాధన యుక్తురాలై తల్లిదండ్రులు లేనిదై పుత్రులును అన్నదమ్ములును కూడ లేనిదై యా నట్టణమందుండి దూషితము గాని పనుల నాచరింపుచు సర్వకాలము గడుపుచుండెను.

శ్లో॥ జన్మాంతర కృతాత్పాపా ద్బాల్యవైధవ్య సంయుతా ।
శ్వశ్రూశ్వశురహీనాచ దేవరాది వివర్జితా ॥

తా॥ ఇంక నెట్టిగుణములు కలదంటిరేని పూర్వజన్మమున సంపాదించిన పాపమువల్ల బాల్యమందే వైధవ్యమును బొందినదై అత్తమామలు లేనిదై మఱుదులయిన లేనిదై యుండెను.

శ్లో॥ తథాఽపిలోకే మహతీ పుణ్యాత్మాచ పతివ్రతా ।
గుణాలవాలా సాధ్వీచే త్యాహుర్బుధ జనాస్సదా ॥

తా॥ ఆ రీతిగ సమస్త బంధుజన రహిత మయినది. గనుకనే స్వేచ్ఛావిహారమందు స్వాతంత్ర్యము గలదయినను లోకమందు తన్ను పండితు లందఱును మిక్కిలి పతివ్రత, సద్గుణములు గలది, గొప్ప స్వభావముగలది, సాత్త్విక గుణము గలదని యెల్లప్పుడు వచించునట్లు ప్రవర్తించెను.

శ్లో॥ ఏవంస్థితే తత్ర పుర్యాం సత్యనారాయణ వ్రతం ॥
కుర్వంతి కారయంతివై పుణ్యాత్మానో మహాధియః ।

తా॥ ఇట్లుండగా ఆ పట్టణమునందు పుణ్యాత్ములయిన పండితులు సత్యనారాయణ వ్రతమును చేయించుట తాముచేయుట మొదలయినవి జరుపు చుండిరి.

శ్లో॥ యేయే కుర్వంతిసత్యస్య వ్రతం వాంఛితం సిద్ధిదం ।
తేషాంతేషాం వాంఛితార్థో భవిష్యతి తదాతదా ॥

తా॥ అట్లు జనుగుకాలమందు యెవరెవరీ సత్య నారాయణ వ్రతము జేసియుండిరో వారివారి కోరికలప్పుడప్పుడు జఱుగుచుండెను.

శ్లో॥ ఏవజగతి విఖ్యాతం వృత్తాంతం శ్రుణ్వతీసతీ ।
సంతానహీనా జగతి వంధ్యాస్తే లోకవిశ్రుతాః ॥

తా॥ ఇట్లు జగమునందు ప్రసిద్ధమైన వ్యాపారమును పతివ్రతయైన యొకవంధ్యవిన్నదై లోకమందు సంతానము లేనివారు వంధ్య అని చెప్పఁబడుదురుగదా యనుకొనెను.

సూతః॥శ్లో॥ ఏతస్మిన్నంతరేతత్ర బ్రాహ్మణీకా చిద స్తిహి ।
సత్యదేవ ప్రసాదేన పుత్రరత్న మజీజనత్ ॥

తా॥ ఇట్లు జరుగుచుండగ నా పట్టణమందొకానొక బ్రాహ్మణ చిన్నది కలదు. ఆమెకు సత్యనారాయణానుగ్రహముచే శ్రేష్ఠుఁడైన పుత్రుఁడొకడు కలిగెను.

శ్లో॥ తద్వృత్తాంతం నిశమ్యాసా వంధ్యాహరిమథామబ్రవీత్
హేసత్యదేవ హేనాధ మమతం దదాసిచేత్ ।
మదైశ్వర్యాను సారేణ తవపూజాం కరోమ్యహమ్ ॥

తా॥ ఆ వృత్తాంతము నీ గొడ్డురాలయిన చిన్నదివిని విష్ణువును గూర్చి యీా చెప్పఁబోవు ప్రకారము పలికెను. ఓ సత్యనారాయణ మూర్తీ! ఓ పాలకుడా! నాకు పుత్రుని కలుగ జేసిన యెడల నా సంపదకు తగినట్లు మీా పూజ చేసెదను.

శ్లో॥ ఇతి సంప్రార్థ్యవచసా వైశ్యపత్నీ మువాచహా ।
భోవైశ్యపత్నిత్వంచాపి ప్రార్థయేత్యాహ పుత్రకమ్ ॥

తా॥ ఈ ప్రకారమా వంధ్య వాక్యముచే ప్రార్థించి సమీాప మందున్న యీా కోమటి భార్యను గూర్చి ఓ వైశ్యపత్నీ, నీవును కుమారుఁడు కలుగునట్లు ప్రార్థింపుమని పలికెను.

శ్లో॥ ఇతిహేళనావాక్యేన చోదయామాన సతాంతదా ।
తదాకర్ణ్య వచస్తస్యాః పరిహాసన పూర్వకం ।
దదాసిచేజ్జగన్నాథ కరిష్యే వ్రతమద్భుతమ్ ।
ఇతిహేళనయావాక్య ముక్త్వా తూష్ణీంబభూవహా ॥

తా॥ ఇట్లు పరిహాసముచే దిక్కులేని యీా కోమటి భార్యను ప్రోత్సాహ పఱచెను. పరిహాస యుక్తమయిన గొడ్రాలీ వాక్యమును విని ఓ జగన్నాథుడా! పుత్రుడు కలిగిన యెడల సత్యనారాయణ వ్రతము చేసెదనని పరిహాసముగా పలికెను.

శ్లో॥ తావన్మాత్రేణ సంతుష్ట స్సత్యనారాయణ ప్రభుః ।
స్వప్నకాలేతయాసార్థం సంగతిం కృతవాన్హరిః ॥

తా॥ సర్వ సమర్థుఁడయిన సత్య నారాయణ మూర్తి ఇట్లు పరిహాసముచే ప్రార్థించిన మాత్రముననే సంతోషము కలిగిన వాఁడై స్వప్నమందా స్త్రీతో సంగమము సలిపెను.

శ్లో॥ ప్రాతరుత్థాయ సానారీ జ్ఞాత్వాతత్స్వప్న చేష్టితం ।
కిమిదం మహదాశ్చర్యం స్వప్న చేష్టాభయంకరీ ॥

తా॥ ఆ స్త్రీ సూర్యోదయకాలమున లేచినదై స్వప్నమందు జరిగిన వృత్తాంతమును దెలిసికొని యిదియేమిి, గొపపయాశ్చర్యముగ నున్నది. స్వప్న వ్యాపారము బహుభయంకరముగా నున్నదనుకొనెను.

శ్లో॥ గర్భోత్పత్తిర్భవేన్నూనం తదాతు మమకాగతిః ।
పరలోక భయం నాస్తి త్విహాలోక భయంభవేత్ ॥

తా॥ ఈ స్వప్నచర్యచే నిశ్చయముగా గర్భము కాగలదు. అట్లు గర్భవతి నయినప్పుడు నాకు గతి యేమి? సాక్షాత్తుగా శ్రీ హరివల్ల నిట్టికార్యము గలిగి నప్పుడు పరలోకమందు భయము లేదు గాని యిహాలోకమందు తప్పక భయముకలుగును.

శ్లో॥ ఏకాకీనీవి భర్త్రాఽహం సర్వబంధు వివర్జితా ।
అపవాదార్ణ వతర్తుమశక్నోమి రమాపతే ॥

తా॥ ఆ విధముగా నాలోచించి ఓ విష్ణుమూర్తీ! పెనిమిటి లేని దానన్నై సమస్త బంధువులులేని నేనొక్కదానను యీ యప వాదమను సముద్రమును దాటుటకు సమర్థురాలను గాను.

శ్లో॥ శరీరంమృత్యుసంయుక్తం మలాద్యైరపిదూషితం ।
అస్థిస్తంభం స్నాయుబద్ధం పినద్ధంచర్మణాధ్రువమ్ ॥

తా॥ విచారించి చూచిన నీశరీరము జన్మముగల వస్తువులవల్ల మరణము గలదను వ్యాప్తిచే నెప్పటి కయిన మరణించునదే అట్లు చనిపోయినను ప్రస్తుత మనుభ వించుటకు తగినదేమో యని యాలో చించినచో మలమూత్రాదులచే నిండినదై యెముకలను స్తంభములు కలిగి స్నాయువులచే కట్టఁబడి చర్మముచే కప్ప బడి యున్నది. నిశ్చయము.

శ్లో॥ అస్థిరం మాంససంయుక్తం క్షణభంగురమధ్రువమ్ ।
ఏవద్దేహంకథంప్రీత్యా పరివాదధురాం వహే ॥

తా॥ ఇంక యెముకల తోను, మాంసము తోను కూడినదై క్షణములో నశించు స్వభావము గలది కనుక నస్థిరమైన యీ దేహమును కాపాడు ప్రేమతో స్థిరమయిన యీ యపవాదమను భారము నెట్లు వహించెదను.

శ్లో॥ తస్మద్దాలాహాలంపీత్వా విస్సజామ్యధునాఽంతనుం ।
ఇతి నిశ్చిత్యమనసా విషం సంగృహ్యయత్నితః ॥

పాత్రేసంస్థాప్య తత్పాతుం ప్రయత్నం కుర్వతీసతీ ॥

తా॥ ఆ హేతువుచే నీ యపవాదమును బోగొట్టు కొనుటకు విషపానము చేసి యస్థిరమయిన యీ దేహమును చాలించెదనని మనస్సున నిశ్చయ పఱచి విషమును ప్రయత్నముచే సంపాదించి యొక పాత్రయందుంచి త్రాగుటకు ప్రయత్నము చేయుచుండెను.

శ్లో॥ ఏవంస్థితేవిష్ణుమాయా రూపానిద్రాసమాగతా ।
ఆ వృత్యతాంచ ప్రజ్ఞాంతు చకారమహతీబలాత్ ॥

తా॥ ఇట్లు వ్రతమందుండగ విష్ణుమాయా స్వరూపు రాలయిన నిద్రాదేవి వచ్చినదై స్త్రీ నావరించి తెలివిలేని దానిగ జేసెను,

శ్లో॥ తత్కాలేసత్యదేవేశేన పాత్రంగరళ పూరితమ్ ।
హృతంపశ్చాత్ప్రబుద్ధాసా రురోదబహుధాభృశమ్ ॥

తా॥ అట్లు నిద్రాయుక్తురాలయిన కాలమందు సత్యనారాయణునిచేత విషముతో నిండిన పాత్రనపహరించ బడెను. పిమ్మట కొంత తడవునకు నిద్ర మేల్కాంచినదై యా చిన్నది మిక్కిలి దుఃఖమును బొందెను.

శ్లో॥ అనేకశోఽనేకధాతు మృతౌయత్నపరాఽభవత్ ।
అనేకశోఽనేకధాతు కృతంవిఘ్నం మహాత్మనా ॥

తా॥ ఇట్లు జరిగిన పిదప ననేక మార్లు అనేక ప్రకారములుగా మృతినొందుటకు ప్రయత్నించెను. ఆ సత్యనారాయణుఁడును అనేక పర్యాయములనేక రీతులుగ నా ప్రయత్నమును విఘ్నము చేసెను.

శ్లో॥ విఘ్నైరప్రాప్తమరణా మనసాయిత్యచింతయత్ ।
అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మశుభాశుభమ్ ॥

తా॥ ఈ విధముగ విఘ్నముల చేత లభింపని మృతిగలదై మనస్సున నిట్లాలోచన చేసెను. జన్మాంతర కృతమయిన కర్మము మంచిదయినను చెడుదయినను అనుభవించియే తీరవలయును.

శ్లో॥ నాభుక్తం క్షీయతేపాపం కల్పకోటిశతైరపి ।
హరిణాపిహరేణాపి బ్రహ్మణాపి సురైరపి ।

లలాట లిఖితా రేఖా పరిమార్ష్టుం నశక్యతే ॥

తా॥ పాపము నూఱు కోట్లు కల్పములయినను అనుభవింపక తప్పదు. ఇంతయేల, బ్రహ్మ, విష్ణు, మహేశులయిన దేవతలయిన నుదుట వ్రాయుగీతను తప్పించ లేరు.

శ్లో॥ ఇతిశాస్త్రం సమాలోచ్య స్వస్థచిత్తా బభూవహ ।
తతః ప్రభృతికాలేన గర్భచిహ్న స్ఫురంతిహి ॥

తా॥ ఈ రీతిని శాస్త్రముల నాలోచించి స్థిర చిత్తురాలై యుండెను. అది మొదలు కొంతకాలమునకు గర్భిణీ లక్షణములు కాన్పించెను.

శ్లో॥ మిథోమిథశ్చతద్వార్తా తత్రతత్ర శ్రుతాఖిలు ।
ఇతికేచిద్వదంత్యత్ర సమయే కేచిదాగతాః ।
వ్రజంతి కర్ణాం రంధ్రౌచి సంపిధాతాత్రి శీఘ్రతః ॥

తా॥ ఇట్లు జరుగు కాలమందు కొంత మంది వచ్చినవారై యొకరి కొకరు ఈ వృత్తాంతమునే జెప్పుకొను చున్నారని చెప్పిరి. మఱియొక సమయమందు కొంతమంది వచ్చి యీ వార్తను విని చెవులు మూసికొని త్వరగా వెళ్ళు చుండిరి.

శ్లో॥ కేచిద్వందతిసానారీ దృఢచిత్తా పతివ్రతా ।
తత్రేదృశీకదాజాతా నకదా పీతినిశ్చయమ్ ॥

తా॥ కొందఱు ఈ స్త్రీ మిక్కిలి దృఢమయిన చిత్తము గల పతివ్రత. ఈమె యందిట్టివార్తయెన్నడుకలిగియుండదు. నిశ్చయమనిరి.

శ్లో॥ ఇత్యాది జనవార్తాసు ప్రవృత్తాసు తదాతదా ।
ప్రస్ఫుటందౌహృదం చిహ్నం దృష్ట్వాసర్వే మహాజనాః ।
చింతమానాస్తుతే సర్వే తూష్ణంభూతా స్తదాఽభవన్ ॥

తా॥ ఈ ప్రకారము జనుల వార్తలప్పుడప్పుడు జరుగుచుండగా సమస్తజనులు స్ఫుటమయిన గర్భిణీ చిహ్నమును చూచి కొంత తడవు విచారించిన వారై యూరకుండిరి.

శ్లో॥ గతేషునవమాసేషు దశమేమాసి కౌముదీ ।

సహస్రసూర్యసంకాశం సుందరం మదనోపమం ।
అసూత బాలకం వంద్యం వ్యోమ్నోమధ్యగ తేరవౌ ॥

తా॥ అంతట నవమాసంబులు వెళ్ళిన పిమ్మట పదవ మాస మందు ఆ కౌముదీయను కోమటి చిన్నది వెయ్యి సూర్యుల కాంతితో ప్రకాశింపుచున్న మన్మథుని బోలియున్న సౌందర్యముగల సర్వజన వందనీయుఁడగు పుత్రుని సూర్యుఁడాకాశ మధ్యమును బొంది యుండగా ప్రసవించెను.

శ్లో॥ దేవదుందుభయో నేదుః పుష్పవృష్టిశ్చ ఖాచ్చ్యుతా ।
సజ్జనానాం హృది బభూవాద్భుతా ప్రీతిరంజసా ॥

తా॥ ఆ ప్రసవ కాలమందు సత్యదేవుని మహిమచే కలిగిన వాఁడగుటచే దేవ వాద్యములు మ్రోగినవి. సత్పురుషుల యొక్క హృదయమందాశ్చర్యకరమయిన ప్రేమశీఘ్రముగా కలిగెను.

శ్లో॥ అక్షర స్వీకృతిం తస్య వర్షే పంచమ సంజ్ఞకే ।
కారయామాస తన్మాతా గురుణైవ ముదాసతీ ॥

తా॥ అట్లు జన్మించిన యీ పిల్లవానికి ఐదవసంవత్సరమురాగా నా పిల్లవాని తల్లిసంతోషముతో గురువుతో అక్షరా భ్యాసము చేయించెను.

శ్లో॥ విద్యారంభ తతశ్చక్రే గురుశ్శిష్యే౽తివత్సలః ।
సకృన్నిగదమాత్రేణ సర్వవిద్యా విశారదః ॥
అభూత్పరమకారుణ్య మూర్తినా గురుణాసమః ॥

తా॥ ఆ రీతిగా నక్షరాభ్యాసమయిన తర్వాత గురువు శిష్యుని యందలి ప్రేమ గల వాఁడాయెను. గురువు ఒక్క పర్యాయము మాత్రమే చెప్పిన వాఁడగుచుండగా సర్వవిద్యలయందు నేర్పుగలవాఁడై మిక్కిలి కరుణారూపుఁడై గురునితో సమానమయినవాఁడై యుండెను.

శ్లో॥ తం దృష్ట్వా జజ్జనాస్సర్వే లేభిరే హర్షముత్తమం ।
చక్రిరే దుర్జనాస్సర్వే ఉపహాసాం పరమఘాతుకీమ్ ॥

తా॥ సజ్జనులు పెనిమిటిలేని స్త్రీకి కలిగిన యీ పిల్లవాని జూచి

యీ చిన్నవాఁడు దైవ ప్రసాదముచే కలిగినవాడు. మహానుభావుడని తెలిసికొని మిక్కిలి సంతోషముతో నుండిరి. కొందఱు దుష్టులు జ్ఞానములేని మిక్కిలి చెడుదైన యసూయభావము నవలంబించిరి.

శ్లో॥ రండాపుత్రోఽయ మిత్యాహుర్బాలకం గుణజాలకం ।
పితరిస్వర్గతే పశ్చాత్త్వంజాతో సిత్యానామక ।

తా॥ అట్లు అసూయాభావముగలవారై మంచి గుణములుగల యీ పిల్లవానిని ఇతఁడు రండకు కలిగిన వాఁడని అనుచుండిరి. ఇట్లా పిల్లవానితో పలికి నీవు నీ తండ్రి చనిపోయిన తర్వాత కలిగితివి నీ యజ్ఞానమేమి తెలిసికొన లేకుంటివిగదా యని పలికిరి.

శ్లో॥ జానాసిచేత్పితా కుత్రవర్తతే వదనామకిం ।
వదస్వనోచేద ద్యైవ శిరోనత్వా వ్రజాధమ ॥

తా॥ లేక తండ్రి నెఱిఁగిన వాడవయిన యెడల నీతండ్రియెచ్చట నున్నవాఁడో యతని నామధేయమేమో చెప్పుము. అట్లు చెప్పని యెడల తలవంచుకొని యింటికి వెళ్ళుము. ఓ అధముడా యనిపలికిరి.

శ్లో॥ ఇతిబ్రువత్స్వసత్స్వేషు రోషవిస్మిత మానసః ।
పునర్నిగృహ్ణంతఃక్రోధం శాంతోఽభూదయమర్భకః ।

తా॥ దుష్టజనులీ ప్రకారము పలుకు చుండగా రోషాశ్చర్యములు కూడిన మనస్సు గలవాఁడైయీ పిల్లవాడు వచ్చిన కోపమును కనబఱచక శాంతిగలవాఁడై యుండెను.

శ్లో॥ వరాటికాదిక్రీడాసు సర్వేషాముత్తమోత్తమః ।
నానాశాస్త్ర ప్రసంగేషు విజయీబహుసంసది ॥

తా॥ ఆ చిన్నవాడు గవ్వలాడుట మొదలగు నాటల యందు అందఱిలో శ్రేష్ఠుడగుచు ననేకమాఱులు సభల యందనేక శాస్త్ర ప్రసంగముల యందు జయము కలిగి యున్నవాడు.

శ్లో॥ భీమవన్మల్లయుద్ధేషు ప్రీతి మల్లవిభీషణః ।
ఈర్ష్యయా దుష్టమనసో హంతుమారభిరేచతమ్ ॥

తా॥ ముష్టియుద్ధముల యందు భీముని వలె శత్రువులయిన

జెట్టీలకు భయముకు చేయువాడు. ఇట్లుండగ దుష్టులు సహించని వారై యా చిన్నవానిని చంపుటకు ప్రయత్నించిరి.

శ్లో॥ కదాచిత్సుప్తి కాలేతు పాదాబద్ధ్వాజలేఽక్షిపన్ ॥
తద్బంధచ్ఛేదనంకృత్వా తీరంప్రాసాతి శీఘ్రతః ॥

తా॥ అట్లు ఆ దుష్టులు చంపనిచ్ఛతో నొకానొక కాలమందు పాదములను కట్టి నదీజలమందు పడవైచిరి. అట్లు పడవేయఁగా నా బంధముల తెంచుకొని త్వరలో నదీతీరము చేరెను.

శ్లో॥ విషందదుర్దుష్ట చిత్తాః కేచిత్కుంతేన తాడితాః ।
కేచిద్దావాగ్ని మధ్యస్థం కారయామాసురర్భకమ్ ॥

తా॥ ఆ చిన్నవానికి కొంతమంది దుష్టులు విషము పెట్టిరి. కొంతమంది బల్లెములచే పొడిచిరి. కొంతమంది వనాగ్నియందుంచిరి.

శ్లో॥ విద్యావినిర్జితాస్సంతో ఘాతుకంకర్మచక్రిరే ।
దుష్టాత్మభిః పీడితోఽపి నాపాయంప్రాప్తవాన్సుధీ ॥

తా॥ ఆ చిన్నవాని విద్యలచే జయింపఁబడి యీ రీతిగ ననేక దుష్టకర్మలను చేసిరి. ఇట్లు దుర్మార్గులచే పీడింపఁబడియు నాతడు అపాయమును బొందని వాడాయెను.

శ్లో॥ పాపాత్మభిఃకృతంకర్మ నిష్ఫలం యాతిదుష్టవత్ ॥

తా॥ పాపులచే చేయబడు కర్మము దుర్బుద్ధిగల మనుజునివలె ఫలము లేనిది కనుక నా చిన్నవాని కపాయము కలుగక పోయెను.

శ్లో॥ తదంబాంకౌముదీనామ్నాం నిత్యంహేళన పూర్వకం ।
రండాచకులటాలజ్జా హీనానాకత సాధ్వసా ।
ఉన్నమయ్యముఖలోకే కథంసంచర తీత్యహో ।
వదంతిలోకాస్తత్రస్థాః పామరాః క్రూరవృత్తయః ॥

తా॥ ఇట్లుండగా నా పట్టణమందు దుష్టవృత్తిగల జ్ఞానములేని జనులు ఆ చిన్నవాని తల్లిని కౌముదియను పేరుగల దానిని యిది పెనిమిటి చనిపోయిన తర్వాత గర్భముచేసి కొనినది రంకులాడి, సిగ్గు నువిడిచి భయములేనిదై లోకమందు తలయెత్తుకొని తిరుగుచున్నది.

ఎంత ఆశ్చర్యము అని పలుకుచుండిరి.

శ్లో॥ అయంకుమారోబలవాన్ విద్యావాన్గుణవాన్ఖలు ।
చతుష్షష్ఠికళాదక్షో వాణిజ్యేచాతి బుద్ధిమాన్ ॥

తా॥ ఈ చిన్నవాడు బలవంతుడును, విద్యగలవాడును, గుణముగలవాఁడును అఱువదినాలుగు విద్యల యందు సమర్థుఁడును వర్తకమందు నేర్పుగలవాఁడునై యుండెను.

శ్లో॥ పకీవాద స్తస్యలోకే బలవాన్జాయతేఽన్యవత్ ।
కథంనివృత్తిస్తస్యస్యా దిత్యాలోచ్యచ పండితైః ।
తాంస్తాన్గ్రామస్థితాన్సర్వాన్ సమాహూయసభాకృతా ॥

తా॥ ఇట్లుండ యిదియేమి, లోకమందు పామరునికి బోలె పండితుండయిన యీ చిన్నవానికి అపకీర్తి బలముగు చున్నది. ఈ యపకీర్తి యెట్లు నశించునని యాలోచించి గ్రామము ముందు జనులను పిలిపించి పండితులు సభ చేసిరి.

శ్లో॥ తస్యాంసభాయాం కేచిత్తు కౌముదీ గుణశాలినీ ।
తస్యామేవాపవాదోఽ యంజాయతే జనసంసది ॥

తా॥ అట్లు సభను చేయఁగా నాసభయందు కొందఱు యీ కౌముదియను చిన్నది మిక్కిలి గుణవంతురాలు. అట్టి గుణవంతురాలయిన యీమెకపకీర్తి జనులయందు పుట్టినది.

శ్లో॥ దైవానుగ్రహ మాత్రేణ సుతోత్పత్తిర్భవిష్యతి ।
మాతుర్భీమక వేర్నార్యాః పుత్రోత్పత్తిశ్చనశ్రుతా ॥

తా॥ దైవానుగ్రహాము చేత పుత్రులు కలుగుట లోకమందు కలదు. దానికి దృష్టాంత మేమనిన, "భీ మ క వి య ను" వానితల్లికి యీ కవికలిగిన వాత్ర మీచే వినఁబడలేదా.

శ్లో॥ కోలాహలస్య పత్న్యాంతు పుత్రోఽభూత్ జ్ఞానవాన్శివాత్ ।
కణి శివిధవాజ్జాతః ప్రసాద చ్చూళ పాణినః ॥

తా॥ కోలాహలుఁడను వాని భార్యయందు శివానుగ్రహము వలన జ్ఞానము గలపుత్రుఁడు కలిగెను. కణికుఁడనువాఁడు శివునియను

గ్రహము వలన విధవయందు కలిగెను.

శ్లో॥ తస్మాదస్మాదపి గ్రాహ్యాః కథంవదతభోజనాః ।
ఇత్యాహుః పరభీతేన మనసా తత్రసంస్థితాః ॥

తా॥ కావున నో జనులారా ! ఆమె యందపవాద మెట్లుండునో చెప్పుడీయని పరలోకభయముగల మనస్సుతో నా సభయందుండు జనులు పలికిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వా నిర్గుణోనామ సభాయాం కశ్చిదుస్థితః ।
ధర్మాత్మా నస్సత్యపరా యూయంపరమనిందకాః ।
ఈర్ష్యాసూయ సిహీనాశ్చ పరోపకృతిశాలినః ॥

తా॥ అట్లుకొందఱు చెప్పిన వాక్యమును నిర్గుణు డనువాడువిని సభయందు లేచినవాడై మీరందఱు ధర్మాత్ములు, సత్యవాదులు, కోపము లేని వారు, పరుల మేలును సహించు వారు పరుల కుప కారము చేయువారు.

శ్లో॥ తథాన్యహందురాత్మాచ నిందకః పరవంచకః ।
యమలోకస్య సంచారో మమాస్తి భవతాంనవా ॥

తా॥ మీరలటువంటి వారలగుదురు గాత. నేను దుష్టుడను. పరులను నిందించు వాడను, వంచన సేయు వాడను యముని లోకమందు సంచారము చేయువాడను. మీరట్టివారు కారు.

శ్లో॥ ఏషావేశ్యాసమావృత్యా దుర్భగా దుష్టచారిణీ ।
సర్వదా కౌముదీత్యాజ్యా సందేహోనాస్తి భోజనాః ॥

తా॥ ఈ కౌముది యను చిన్నది నడవడిక చేత వేశ్యతో సమానమైనది. దౌర్భాగ్యురాలు. దుష్ట సంచారము గలది ఓ జనులారా ! ఏ విధమున నయినను నీమె విడువ దగినది. సందేహము లేదు.

శ్లో॥ తన్నామోచ్చారణానర్హా తయాకిం పాపచేతసా ।
ఇత్యుదీర్య సభామధ్యే కేషాంచిత్కర్ణగోళకే ।
మంత్రయిత్వాతదాతాంస్తాన్ సంఘీకృత్వా వతిష్ఠకే ॥

తా॥ దీని నామముకూడ తలంప కూడదు. పాపబుద్ధి గల దానితో మాకేమి అనిపలికి సభామధ్యమందు కొందఱితో నాలోచించి యప్పుడు కొంతమందిని తనపక్షము చేర్చుకొని యుండెను.

శ్లో॥ ఏవంతిష్ఠతి వైశ్యేచ నిర్గుణో నామకేఖలే ।
దద్భార్యాశీల సంపన్నా కమలాక్షీలాతి విశ్రుతా ।
తాందృష్ట్వాగృహమధ్యేతు దాసీభ్రాంతిమ వాపసః ॥

తా॥ ఈ రీతిగ దుష్టుఁడయిన నిర్గుణుఁడను కోమటి కక్ష నవలంబించి యుండగ పాతివ్రత్యస్వభావముగల కమలాక్షియను పేరుగల తనభార్యను తనగృహమందు చూచిన వాఁడై యా కోమటి దాసియను భ్రాంతి కలఁవాడాయెను.

శ్లో॥ కిమిదం గృహమధ్యస్థా కథయామాస దుర్భగే ।
ఇత్యుక్త్వా తచ్ఛిఖాం గృహ్ణ్వాదేనాయదంముత్తదా ॥

తా॥ అట్లు భ్రాంతికల వాఁడై యిదియేమి. ఓ దౌర్భాగ్యురాలా ! ఏలగృహ మధ్య మందుంటిని చెప్పుమని దాని కొప్పును పట్టుకొని కాలితో తన్నెను.

శ్లో॥ తందృష్ట్వాప్రాణనాథంసా దౌవారికభ్రమంయయూ ।
హస్తవర్త్యం కుశేనాశు తాడయామాసతంముహుః ॥

తా॥ ఆ సద్వృత్తిగలభార్యయు పెనిమిటినిజూచి ద్వారమందు కావలి యుండు వాడను భ్రాంతికలదై హస్తమందుండు నంకుశముతో నతనిని వేగముతో కొట్టినది.

శ్లో॥ కాత్వంనీచకులేజాతా మద్గేహంతః ప్రవిశ్యసి ।
దౌవారికాధమత్వంకో మాంతాడయసి నిష్ఠురమ్ ॥

తా॥ నీ వెవతవే నీచ కుల మందు పుట్టి నా గృహము లోనికి ప్రవేశించితివని నిర్గుణుఁడనఁగా నతనిభార్య ద్వారపాలకులలో నధముఁడవయిన నీవెవ్వఁడవు నన్ను కఠినముగా కొట్టెదవని పలికెను.

శ్లో॥ ఇత్యూచమానౌ తౌదృష్ట్వా వీధ్యాం వీధ్యాం ప్రవిశ్యచ ।
హస్తాభ్యాం పాదయుగ్మేన తాడయామాసతుర్భృశమ్ ॥

తా॥ ఈ రీతిని ఒకరికొకరు ప్రాగల్భ్యముతో పలుకుకొనుచు పట్టి వీధియందు ప్రవేశించి చేతుల తోడను కాళ్ళ తోడను మిక్కిలి కొట్టుకొనిరి.

శ్లో॥ రండేతి రండా పుత్రేతి వాగ్వ్యాపారంచ కుర్వతౌ ।
కేశాకర్షణ సంరంభౌ ముష్టిఘాత సమన్వితౌ ।
దండప్రహారణౌ కుద్ధౌ నఖఘాతైశ్చ రంజితౌ ।
పరస్పర మజానంతౌ దంపతీ దృష్ట వాన్జనః ॥

తా॥ అట్లు కొట్టుకొనుచు రండ రండాపుత్రియను వాక్కులను పలుకుచు జుట్టుపట్టుకొని యీడ్చుకొనుచు, పిడికిలి గుద్దులు గుద్దు కొనుచు కఱ్ఱలతో కొట్టుకొనుచు గోళ్ళతో గిచ్చు కొనుచు కోపము గలవారై యొకరి నొకరు తెలిసికొన లేక తిరుగు చున్న దంపతులను గ్రామమందుండు జనులు చూచిరి.

శ్లో॥ కిమిదంమహదాశ్చర్యం హేతు కేనచాభవత్ ॥
కలావతీమహాసాధ్వీ కమలాక్షు పతిప్రియా ॥

తా॥ అట్లు చూచి యిది యేమి గొప్ప యాశ్చర్యము! ఏ హేతువువల్ల కలిగినది. కలియుగమందీ కమలాక్షి యనునది బహు బుద్ధి కలదై పతివ్రతయై పెనిమిటి యందలి ప్రేమకలిగి యున్నది.

శ్లో॥ నిర్గుణఃక్రూరచిత్తోఽపి కీర్తిమాన్లోక విశ్రుతః ।
ఏతయోఃప్రాక్కృతం కర్మచేత్థం ఫలతి నాన్యథా ॥

తా॥ నిర్గుణుడనువాడు కఠిన మనస్సు కలవాడయినను గొప్ప కీర్తిగలవాడై, లోకమందలి ప్రసిద్ధుడయి యుండెను. వీరిద్దఱి కిట్లు సంభవించ వలసినది కాదు. వీరిద్దఱకు పూర్వ జన్మార్జిత దుష్కర్మమిట్లు పరిణమించినది. మఱియొక కారణ మేమియు లేదు.

శ్లో॥ ఇత్యాలోచ్యజనాస్సర్వే పూర్వేద్యుస్తస్య చేష్టితం ।
కౌముదివిషయే క్రూరవాక్యం స్మృత్వాతతఃపరమ్ ॥

తా॥ సర్వజనులిట్లాలోచించి పూర్వదినము జఱిగిని కౌముదీ యనుచిన్నదాని విషయమై పలికిన కఠినవాక్యమును తలచిన పిమ్మట.

శ్లో॥ ఆహూయకౌముదీంపుత్ర విషయంవాక్యమబ్రువన్ ।
మాతఃకథయ పుత్రస్య వృత్తాంతం జనసంసది ॥

తా॥ కౌముది యను నామెను పిలిపించి పుత్రుని గూర్చి యొకానొక ప్రశ్న జేసిరి. అది యేమనిన నీ మహాజన సభయందు ఓ తల్లీ! నీ కుమారుని గూర్చి వాస్తవమైన వృత్తాంతము జెప్పుమనిరి.

శ్లో॥ యదార్థం వదనిశ్శేషం నభీఃకార్యాత్వయానఘే ।
ఇత్యుక్త్వాసా మహాసాధ్వీ వక్తుమారభతేతదా ॥

తా॥ నీకేమియు భయము లేదు. సత్యముగా వృత్తాంతమంతయు చెప్పుమని యా పతివ్రత సభయందడుగ బడినదై అప్పుడు చెప్పుటకు ప్రారంభించెను.

శ్లో॥ బ్రాహ్మణ్యాఃపరిహాసార్థం వాక్యంశ్రుత్వాఽహమబ్రువం ।
మమాశుపుత్రోహే సత్యనారాయణ మహాప్రభో ।
పశ్చాద్వ్రతం కరిష్యామి త్యుక్త్వా తూష్ణీంవసామ్యహమ్ ॥

తా॥ ఓ మహామహులారా! నేనొక బ్రాహ్మణ స్త్రీ యొక్క పరిహాసవాక్యమును విని యీ దిగువ రీతిగా పలికితిని. ఓ సత్యనారాయణ మూర్తీ! మహానుభావా! నాకు కుమారుఁడు కలిగి నట్లయిన పిమ్మట నీ వ్రతము తప్పక చేసెదనని పరిహాసముగ పలికి యూరకుంటిని.

శ్లో॥ తావన్మాత్రేణ సత్యస్య ప్రసాదాద్గర్భిణీ సతీ ।
తత్కాలే మరణోపాయా బహువారం మయాకృతాః ॥

తా॥ అంతమాత్రముననే సత్యనారాయణానుగ్రహము గలిగి గర్భవంతురాలయితిని. అట్టికాలమందు నా చేత అనేక మారులు మరణోపాయములు చేయబడినవి.

శ్లో॥ తేసర్వే మరణోపాయాస్తేన దేవేనవారితాః ।
తతఃపరం మనఃకృత్వా శిలారూపాం వసామ్యహమ్ ।

తా॥ అట్లు నాచే చేయఁబడిన 'మరణోపాయముల నన్నింటిని ఆ సత్యదేవుఁడు విఘ్నములచే నివారించెను. అటుపిమ్మట మనస్సును రాయి చేసికొని యుంటిని.

శ్లో॥ కుమారోదయమారభ్య భవద్భిర్జ్ఞాయతేఽఖిలం ।
ఏతస్మాదన్య వృత్తాంతం నజానామి సభాసదః ॥

తా॥ పిమ్మట పుత్రోత్పత్తి కలిగినది మొదలు జరిగిన వ్యాపారము మీకు విశదమే కదా. ఇంతకు తప్ప మఱియొక వ్యాపారమును నేనెఱుగను ఓ సభ్యులారా యని విన్నవించెను.

శ్లో॥ ఇత్యుక్త్వా విరరామాసౌ వాక్యం వాక్యవిచక్షణా ॥
శ్రుత్వాతు కౌముదీవాక్యం పరంవిశ్వాసమాయయుః ॥

తా॥ పలుకుటయందు నేర్పుగల కౌముది యను చిన్నది యీ రీతిని వాక్యమును వచించి విరమించెను. సభాజనులా కౌముదీ వాక్యమును విని మిక్కిలి నమ్మిక కలవారైరి.

శ్లో॥ కమలాక్షీ నిర్గుణశ్చ దంపతీ ప్రకృతింగతౌ ।
ఇదానీ మేవతాభ్యాం చేత్కారయిష్యా మహేవ్రతమ్ ॥

తా॥ ఈ కమలాక్షియు నిర్గుణుఁడను దంపతులు పూర్వస్థితిని బొందినయడల నిప్పుడే వారిచే సత్యనారాయణ వ్రతముచేయింపగలము.

శ్లో॥ ఇత్యుదీర్య జనాస్సర్వే పశ్యంతౌ దుష్టదంపతీ ।
జ్ఞాత్వాఽజ్ఞానాత్కృతం కర్మశిరోనత్వాఽపతుర్గృహమ్ ॥

తా॥ ఇట్లు పలికి జనులందఱు చూచుచుండఁగా దుష్టస్వభావము గల యాదంపతులీ కృత్యమును తెలియక చేసినదానిని తెలిసికొని తలవంచుకొని సిగ్గుచే గృహము ప్రవేశించిరి.

శ్లో॥ సంఘీభూయజనాస్సర్వే నిర్గుణంచేద మబ్రువన్ ।
వ్రతంసత్యస్య దేవస్య కురుశీఘ్రమ తంద్రితః ॥

తా॥ పిమ్మట జనులందఱు గుమికూడి ఓ నిర్గుణుఁడా! తొందర లేనివాఁడవై త్వరగా సత్యనారాయణ దేవుని వ్రతముమ జేయుమనిరి.

శ్లో॥ తచ్ఛ్రుత్వాజనవాక్యంతు తదాచక్రే వ్రతోత్తమం ।
కౌముదీ ధైర్య మాపన్నా వ్రతంకర్తుంసముద్యతా ॥

తా॥ నిర్గుణుఁడను వాడు జనుల యొక్క వాక్యమును విని అప్పుడు శ్రేష్టమయిన సత్యనారాయణ వ్రతమును జేసెను కౌముదియు

నపవాదము తప్పినదిగదాయని ధైర్యము గలదై సత్యనారాయణ వ్రతమును జేయుటకు ప్రయత్నము గలదాను.

శ్లో॥ సర్వాన్బంధూన్సమాహూయ వ్రతమాచరితంత్వయా ॥
వ్రతావసానే కేచిత్తు ప్రసాదగ్రహణం కథం ।
ఇతిసందిహ్యతత్రస్థా నోచుర్భయా సమన్వితా ॥

తా॥ సమస్త బంధువులను బిలచి ఆ కౌముది యను చిన్న దానిచే వ్రతము చేయఁబడినది. అట్లు వ్రతము జఱిగిన తర్వాత కొందఱు ప్రసాదమును గ్రహించుట యెట్లు అని సందేహము కలిగి యింతకుముందు జఱిగిన నిర్గుణుని వ్యాపారము వల్ల కలిగిన సందేహమును భయముచే వెల్లడిచేయక యూరకుండిరి.

శ్లో॥ తత్రాంతరేతి గంభీరం వాక్యంగగనమండలాత్ ।
కౌముద్యాయద్యదుక్తం హితత్తత్సత్యంనసంశయః ।
విశ్వాసం యస్యమనసి నాస్తి తత్సర్వ సంపదః ।
హరిష్యేఽత్రన సందేహ ఇత్యశ్రావి మహాద్భుతమ్ ॥

తా॥ ఇట్లుండగా నాకాసమునుండి కౌముదియను చిన్నదానిచే నేది చెప్పఁబడినదో యదియంతయు నిజము. సంశయము లేదు. ఎవని మనస్సున నమ్మకము లేకుండానో వాని సమస్త సంపత్తుల నపహరించెదను. ఈ విషయము సందేహములేదని మిక్కిలి ఆశ్చర్యముగా వినఁబడినది.

శ్లో॥ తచ్ఛ్రుత్వా సకలావాణీం జనాస్సంతోషమాయయుః ।
నిర్గుణోనామ వైశ్యోఽపి పరాంప్రీతమవాపసః ॥

తా॥ ఆ యాకాశవాణి యొక్క వాక్యమును సంపూర్ణముగా విని సభాజనులు సంతోషమునుబొందిరి. ఈ నిర్గుణుఁడను కోమటియు మిక్కిలి ప్రేమను బొందెను.

శ్లో॥ కౌముదీసూనవేస్వస్య సుతాంప్రీత్యాచదత్తవాన్ ।
స్నుషాపుత్రసమాయుక్తా కౌముదీవిరరాజసా ॥

తా॥ ఆ నిర్గుణుఁడనువాడు కౌముది యొక్క కుమారునికి

తన పుత్రికను సంతోషముతో నిచ్చి వివాహము చేసెను. కౌముది యనుకోమటి చిన్నది కోడలితోను కుమారునితోను కూడి మిక్కిలి ప్రకాశించుచున్నది.

శ్లో॥ బుభోజ సర్వభోగాంశ్చాఽవసానే హరిమందిరమ్ ।
ప్రాప్యకల్పముషిత్వాచ తతః కైలాసమన్వగాత్ ॥

తా॥ పిమ్మటభూలోకమందే సమస్త భోగముల ననుభవించి దేహాంతమందు వైకుంఠమును జేరియొక కల్పకాలముండి యంతట కైలాసమును బొందెను.

శ్లో॥ తత్రస్థిత్వా కల్పమేకం జగామబ్రహ్మణఃపదం ।
తత్రానుభూయతద్భోగాన్ విముక్తింయాతిబ్రహ్మణా ॥

తా॥ ఆ కైలాసమందు ఒక కల్పమునుండి బ్రహ్మలోకము వచ్చి చేరెను, ఆ బ్రహ్మలోకమందు కొంతతడవు భోగముల ననుభవించి బ్రహ్మతోగూడ ముక్తిని బొందెను.

శ్లో॥ యఇదం శృణుయాన్నిత్యం భక్తియుక్తేన చేతసా ।
ఇహలోకేసుఖంభుక్త్వా హ్యంతేస్వర్గమవాప్నుయాత్ ॥

తా॥ ఈ కథను యెవరు భక్తిగల చిత్తముతో వినునో వారు యీ లోకమందు సుఖముల ననుభవించి దేహాంతమందు స్వర్గమును జే రు దు రు.

శ్లో॥ యేమూఢోనిందతేఽధ్యాయ మిమంలోకేషువిశ్రుతం ।
స్వర్గలోకస్థితా స్తస్య పూర్వేనారకినోఽభవన్ ॥

తా॥ మూఢుఁడయిన యెవఁడు లోకమందు ప్రసిద్ధమయినయీ యధ్యాయమును నిందచేయునో వానియొక్క స్వర్గమందున్న పూర్వు లందఱు నరకమును బొందెదరు.

ఇతి నవమోధ్యాయ సమాప్తః .



ఇతి స్కాందపురాణే రేవాఖండే సూత శౌనక సంవాదే
సత్యనారాయణ వ్రతకల్ప సమాప్తః

# శ్రీ సత్యనారాయణ అష్టోత్తరమ్.

ఓం శ్రీసత్యనారాయణస్వామినే నమః
సత్యవ్రతాయ
సత్యవరాయ
సత్యస్థాయ
సతాంగతయే
సత్యేశాయ
సత్యసంకల్పాయ
సత్యచారిత్రలక్షణాయ
సత్యధియే
వైకుణ్ఠమన్దిరాయ ౧౦
ఆయుఃప్రదాయై
అష్టైశ్వర్యప్రదాయై
లక్ష్మీనాయకాయై
దుస్స్వప్నధ్వంసకాయ
సుస్వప్నఫలదాయకాయ
మౌక్తికమాలికాయ
మన్దారచాంపేయమాలినే
రత్నాభరణముద్రితే
చన్ద్రశ్రీఖణ్డవేషవతే
చక్రిణే ౨౦
శఙ్ఖినే
కౌస్తుభదీప్తిమతే
శ్రీవత్సాఙ్కితవక్షస్కాయ
లక్ష్మీసంశ్రితహృత్కటాయ
నీలోత్పలనిభాకారాయ
కస్తూరితిలకాఞ్చితాయ

ఓం ఝషాంగవతే నమః
సోమకప్రాణహారిణే
ఆనతామ్నాయాయ
అబ్ధిసఞ్చరాయ ౩౦
దేవాసురవరస్తుత్యాయ
పతన్మన్ధరధారకాయ
కచ్ఛపాఙ్గాయ
పయోనిధివిమన్థకాయ
అమరామృతసన్ధాత్రే
హిరణ్యాక్షవిదారిణే
యజ్ఞాయ
లీలాక్రోడాయ
ప్రతాపవతే
దణ్డకాసురవిధ్వంసినే ౪౦
వక్రదంష్ట్రాయ
నృసింహాయ
జ్వాలాకరాళవదనాయ
శృఙ్ఖలాస్తమ్భోద్భవాయ
హిరణ్యోరస్థలభిన్నకాయ
సింహాముఖాయ
ప్రహ్లాదవరదాయ
శ్రీలక్ష్మీనృసింహాయ
మౌఞ్జియుజే నమః
ఛాత్రకాయ ౫౦
దణ్డినే
కృష్ణాజినధరాయ
వటవే

ఓం జామదగ్న్యాయనమః
కుఠారిణే
కార్తవీర్యవిదారిణ్యాయ
దుష్టక్షత్రియమర్ధనాయ
దుష్టనిగ్రహాయ
ఖడ్గినే
ముసలినే ౬౦
హలినే
శూలినే
రవివంశసముద్భూతాయ
విశ్వామిత్రప్రియఙ్కరాయ
అహల్యాశాపవిచ్ఛేదినే
జానకీపరిణేత్రే
హనుమత్సరిలోవితాయ
విభీషణవరప్రదాయ
దశకంఠశిరోధ్వంసినే
దేవకీగర్భసంభూతాయ ౭౦
కాళీయఫణిదర్పఘ్నే
కంసగ్రీవానికృన్తనాయ
తాపకల్యరవినాశకాయ
బాణబాహువిదారకాయ
బుద్ధాయ
విశుద్ధాయ
క్రతుహింసావినిన్దకాయ
ఓం కల్కినేనమః
మ్లేచ్ఛప్రహర్త్రే
దుష్టనిగ్రహకారకాయ ౮౦
ధర్మప్రతిష్ఠాకారిణే
శేషాద్రినిలయాయ
వృషదృగ్గోచరాయ
విష్ణవే
దామోదరాయ
నీలమేఘనిభాయ
బ్రహ్మదేవదుర్ధరవిశ్వరూపాయ
వాసుదేవాయ
ద్రవన్మృగమదాసక్త విగ్రహాయ
నిత్యానందమూర్తయే ౯౦
అర్థప్రదాత్రే
విశ్వతీర్థాఘహారిణే
అచ్యుతాయ
క్షీరాబ్ధివాధాయ
వైకుంఠాచలవాసినే
ముకున్దాయ
అనన్తాయ
శ్రీనివాసాయ
గోవిన్దాయ
సువర్ణముఖరస్నాత ౧౦౦
మనుజాభీష్టదాయినే
పన్నగాశనవాహనాయ
పుణ్యశ్లోకాయ
తీర్థపాదాయ
వేదవేద్యాయ
దయానిధయే
సర్వగ్రహరూపిణే
పరాత్పరాయ ౧౦౮

అష్టోత్తరం సమాప్తః

# శ్రీ విష్ణు సహస్ర నామావళిః

ఆద్యంతయోః ప్రణవోచ్చారణం కేచిత్కుర్వంతి.

ఓం విశ్వస్మైనమః
విష్ణవేనమః
వషట్కారాయనమః
భూతభవ్యభవత్ప్రభవేనమః
భూతకృతేనమః
భూతభృతేనమః
భావాయనమః
భూతాత్మనేనమః
భూతభావనాయనమః
పూతాత్మనేనమః ౧౦
ఓం పరమాత్మనేనమః
ముక్తానాంపరమాగతయేనమః
అవ్యయాయనమః
పురుషాయనమః
సాక్షిణేనమః
క్షేత్రజ్ఞాయనమః
అక్షరాయనమః
యోగాయనమః
యోగవిదాంనేత్రేనమః
ప్రధానపురుషేశ్వరాయ నమః
ఓం నారసింహవపుషేనమః ౨౦
శ్రీమతేనమః
కేశవాయనమః
పురుషోత్తమాయనమః
సర్వస్మైనమః
శర్వాయనమః

ఓం శివాయనమః
స్థాణవేనమః
భూతాదినిధయేనమః
అవ్యయాయనమః ౩౦
ఓం సంభవాయనమః
భవనాయనమః
భర్త్రేనమః
ప్రభవాయనమః
ప్రభవేనమః
ఈశ్వరాయనమః
స్వయమ్భువేనమః
శమ్భవేనమః
ఆదిత్యాయనమః
పుష్కరాక్షాయనమః ౪౦
ఓం మహాస్వనాయనమః
అనాదినిధనాయమః
ధాత్రేయనమః
విధాత్రేనమః
ధాతురుత్తమాయనమః
అప్రమేయాయమః
హృషీకేశాయనమః
పద్మనాభాయనమః
అమరప్రభవేనమః
విశ్వకర్మణేనమః ౫౦
ఓం మనవేనమః
త్వష్ట్రేనమః

స్థవిష్ఠాయనమః
స్థవిరాయనమః
ధ్రువాయనమః
అగ్రాహ్యాయనమః
శాశ్వతాయనమః
కృష్ణాయనమః
లోహితాక్షాయనమః
ప్రవర్ధనాయనమః ౬౦
ఓం ప్రభూతాయనమః
త్రికకుద్ధా ( ద్భా ) మ్నేనమః
పవిత్రాయవమః
మంగళాయపరస్మైనమః
ఈశానాయనమః
ప్రాణనాయనమః
ప్రాణాయనమః
జ్యేష్ఠాయనమః
శ్రేష్ఠాయనమః
ప్రజాపతయేనమః ౭౦
ఓం హిరణ్యగర్భాయనమః
భూగర్భాయనమః
మాధవాయనమః
మధుసూధనాయనమః
ఈశ్వరాయనమః
విక్రమిణేనమః
ధన్వినేనమః
మేధావినేనమః
విక్రమాయనమః
క్రమాయనమః ౮౦

ఓం అనుత్తమాయనమః
దురాదర్షాయనమః
కృతజ్ఞాయనమః
కృతయేనమః
ఆత్మవతేనమః
సురేశాయనమః
శరణాయనమః
శర్మణేయనమః
విశ్వరేతసేనమః
ప్రజాభవాయనమః ౯౦
ఓం అహ్నేనమః
సంవత్సరాయనమః
వ్యాళాయనమః
ప్రత్యయాయనమః
సర్వదర్శనాయనమః
అజాయనమః
సర్వేశ్వరాయనమః
సిద్ధాయనమః
సిద్ధయేనమః
సర్వాదయేనమః ౧౦౦
ఓం అచ్యుతాయనమః
వృషాకపయేనమః
అమేయాత్మనేనమః
సర్వయోచవినిస్సృ
వనవేనమః
వసుమనసేనమః
సత్యాయనమః
సమాత్మనేనమః

సమ్మితాయనమః
సమాయనమః ౧౧౦
ఓం అమోఘాయనమః
పుండరీకాక్షాయనమః
వృషకర్మణేనమః
వృషాకృతయేనమః
రుద్రాయనమః
బహుశిరసేనమః
బభ్రవేనమః
విశ్వయోనయేనమః
శుచిశ్రవసేనమః
అమృతాయనమః ౧౨౦
ఓం శాశ్వతాయనమః
స్థాణవేనమః
వరారోహాయనమః
మహాతపసేనమః
సర్వగాయనమః
సర్వవిదేనమః
భానవేనమః
విష్వక్సేనాయనమః
జనార్ధనాయనమః
వేదాయనమః ౧౩౦
ఓం వేదవిదేనమః
అవ్యఙ్గాయనమః
వేదాఙ్గాయనమః
వేదవిదేనమః
కవయేనమః
లోకాధ్యక్షాయనమః
సురాధ్యక్షాయనమః
ధర్మాధ్యక్షాయనమః
కృతాకృతాయనమః
చతురాత్మనేనమః ౧౪౦
ఓం చతుర్వ్యూహాయనమః
చతుర్దంష్ట్రాయనమః
చతుర్భుజాయనమః
భ్రాజిష్ణవేనమః
భోజనాయనమః
భోక్త్రేనమః
సహిష్ణవేనమః
జగదాదిజాయనమః
అనఘాయనమః
విజయాయనమః ౧౫౦
ఓం జేత్రేనమః
విశ్వయోనయేనమః
పునర్వసవేనమః
ఉపేన్ద్రాయనమః
వామనాయనమః
ప్రాంశవేనమః
అమోఘాయనమః
శుచయేనమః
ఊర్జితాయనమః
అతీన్ద్రాయనమః ౧౬౦
ఓం సంగ్రహాయనమః
సర్గాయనమః
ధృతాత్మనేనమః
నియమాయనమః
యమాయనమః
వేద్యాయనమః

వైద్యాయనమః
సదాయోగినేనమః
వీరఘ్నేనమః
మాధవాయనమః ౧౭౦
ఓం మధవేనమః
అతీన్ద్రియాయనమః
మహామాయాయనమః
మహోత్సాయనమః
మహాబలాయనమః
మహాబుద్ధయేనమః
మహావీర్యాయనమః
మహాశక్తయేనమః
మహాద్యుతయేనమః
అనిర్దేశ్యవపుషేనమః ౧౮౦
ఓం శ్రీమతేనమః
అమేయాత్మనేనమః
మహాద్రిధృతేనమః
మహేష్వాసాయనమః
మహీభర్త్రేనమః
శ్రీనివాసాయనమః
సతాంగతయేనమః
అనిరుద్ధాయనమః
సురానన్దాయనమః
గోవిన్దాయనమః ౧౯౦
ఓం గోవిదాంపతయేనమః
మరీచయేనమః
దమనాయనమః
హంసాయనమః
సుపర్ణాయనమః
భుజగోత్తమాయనమః
హిరణ్యనాభాయనమః
సుతపసేనమః
పద్మనాభాయనమః
ప్రజాపతయేనమః ౨౦౦
ఓం అమృత్యవేనమః
సర్వదృశేనమః
సింహాయనమః
సంధాత్రేనమః
సంధిమతేనమః
స్థిరాయనమః
అజాయనమః
దుర్మర్షణాయనమః
శాస్త్రేనమః
విశ్రుతాత్మనేనమః ౨౧౦
ఓం సురారిఘ్నేనమః
గురుతమాయగురవేనమః
ధామ్నేనమః
సత్యాయనమః
సత్యపరాక్రమాయనమః
నిమిషాయనమః
అనిమిషాయనమః
స్రగ్విణేనమః
వాచస్పతయేనమః
ఉదారధియేనమః ౨౨౦
ఓం అగ్రణ్యేనమః
గ్రామణ్యేనమః
శ్రీమతేనమః
న్యాయాయనమః
నేత్రేనమః

సమీరణాయనమః
సహస్రమూర్ధ్నే నమః
విశ్వాత్మనేనమః
సహస్రాక్షాయనమః
సహస్రపదేనమః ౨౩౦
ఓం ఆవర్తనాయనమః
నివృత్తాత్మనేనమః
సంవృతాయనమః
సంప్రమర్దనాయనమః
అహస్సంవర్తకాయనమః
వహ్నయేనమః
అనిలాయనమః
ధరణీధరాయనమః
సుప్రసాదాయనమః
ప్రసన్నాత్మనేనమః ౨౪౦
ఓం విశ్వసృజేనమః
విశ్వభుజేభవేనమః
సత్కర్త్రేనమః
సత్కృతాయనమః
సాధవేనమః
జహ్నవేనమః
నారాయణాయనమః
నరాయనమః
అసంఖ్యేయాయనమః
అప్రమేయాత్మనేనమః ౨౫౦
ఓం విశిష్టాయనమః
శిష్టకృతేనమః
శుచయేనమః
సిద్ధార్థాయనమః
సిద్ధసంకల్పాయనమః
సిద్ధిదాయనమః
సిద్ధిసాధనాయనమః
వృషాహిణేనమః
వృషభాయనమః
విష్ణవేనమః ౨౬౦
ఓం వృషపర్వణేనమః
వృషోదరాయనమః
వర్ధనాయనమః
వర్ధమానాయనమః
వివిక్తాయనమః
శ్రుతిసాగరాయమః
సుభుజాయనమః
దుర్ధరాయనమః
వాగ్మినేనమః
మహేంద్రాయనమః ౨౭౦
ఓం వసుదాయనమః
వసవేనమః
నైకరూపాయనమః
బృహద్రూపాయనమః
శిపివిష్టాయనమః
ప్రకాశనాయనమః
ఓజసే, తేజసేద్యుతిధరామ
ప్రకాశాత్మనేనమః
ప్రతాపనాయనమః
బుద్ధాయనమః ౨౮౦
ఓం స్పష్టాక్షరాయనమః
మన్త్రాయనమః
చన్ద్రాంశవేనమః

భాస్కరద్యుతయేనమః
అమృతాంశూద్భవాయనమః
భానవేనమః
శశిబిన్దవేనమః
సురేశ్వరాయనమః
ఔషధాయనమః
జగతస్సేతవేనమః ౨౯౦
ఓం సత్యధర్మపరాక్రమాయనమః
భూతభవ్యభవన్నాథాయ నమః
పవనాయనమః
పావనాయనమః
అనలాయనమః
కామఘ్నేనమః
కామకృతేనమః
కాన్తాయనమః
కామప్రదాయనమః ౩౦౦
ఓం ప్రభవేనమః
యుగాదికృతేనమః
యుగావర్తాయనమః
నైకమాయాయనమః
మహాశనాయనమః
అదృశ్యాయనమః
వ్యక్తరూపాయనమః
సహస్రజితేనమః
అనన్తజితేనమః
ఇష్టాయనమః ౩౧౦
ఓం అవిశిష్టాయనమః
శిష్టేష్టాయనమః
శిఖణ్డినేనమః

నహుషాయనమః
వృషాయనమః
క్రోధఘ్నేనమః
క్రోధకృతేనమః
కర్త్రేనమః
విశ్వబాహవేనమః ౩౨౦
ఓం మహీధరాయనమః
అచ్యుతాయనమః
ప్రథితాయనమః
ప్రాణాయనమః
ప్రాణదాయనమః
వాసవానుజాయనమః
అపాన్నిధయేనమః
అధిష్ఠానాయనమః
అప్రమత్తాయనమః
ప్రతిష్ఠితాయనమః ౩౩౦
ఓం స్కన్దాయనమః
స్కందధరాయనమః
ధుర్యాయనమః
వరదాయనమః
వాయువాహనాయనమః
వాసుదేవాయనమః
బృహద్భానవేనమః
ఆదిదేవాయనమః
పురందరాయనమః
అశోకాయనమః
తారణాయనమః ౩౪౦
ఓం తారాయనమః
శూరాయనమః

శౌరయేనమః
జనేశ్వరాయనమః
అనుకూలాయనమః
శతావర్తాయనమః
పద్మినేనమః
పద్మనిభేక్షణాయనమః
పద్మనాభాయనమః
అరవిందాక్షాయనమః 3౫౦
ఓం పద్మగర్భాయనమః
శరీరభృతేనమః
మహర్ధయేనమః
ఋద్ధాయనమః
వృద్ధాత్మనేనమః
మహాక్షాయనమః
గరుడధ్వజాయనమః
అతులాయనమః
శరభాయనమః
భీమాయనమః 3౬౦
ఓం సమయజ్ఞాయనమః
హవిషే, హరయేనమః
సర్వలక్షణలక్షణ్యాయనమః
లక్ష్మీపతేనమః
సమితింజయాయనమః
అక్షరాయనమః
రోహితాయనమః
మార్గాయనమః
హేతవేనమః
దామోదరాయనమః 3౭౦
ఓం స (హాసే) హాయనమః
మహీధరాయనమః
మహాభాగాయనమః
వేగవతేనమః
అమితాశనాయనమః
ఉద్భవాయనమః
క్షోభణాయనమః
దేవాయనమః
శ్రీగర్భాయనమః
పరమేశ్వరాయనమః 3౮౦
ఓం కరణాయనమః
కారణాయనమః
కర్త్రేనమః
వికర్త్రేనమః
గహనాయనమః
గుహాయనమః
వ్యవసాయాయనమః
వ్యవస్థానాయనమః
సంస్థానాయనమః
స్థానదాయనమః 3౯౦
ఓం ధ్రువాయనమః
పరర్థయేనమః
పరమస్పష్టాయనమః
తుష్టాయనమః
పుష్టాయనమః
శుభేక్షణాయనమః
రామాయనమః
విరామాయనమః
విరతాయనమః
మార్గాయనమః ౪౦౦

ఓం విరజోమార్గాయనమః
నేయాయనమః
నయాయనమః
అనయాయనమః
వీరాయనమః
శక్తిమతాంశ్రేష్ఠాయనమః
ధర్మాయనమః
ధర్మవిదుత్తమాయనమః
వైకుంఠాయనమః
పురుషాయనమః ౪౧౦
ఓం ప్రాణాయనమః
ప్రాణదాయనమః
ప్రణవాయనమః
పృథవేనమః
హిరణ్యగర్భాయనమః
శత్రుఘ్నాయనమః
వ్యాప్తాయనమః
వాయవేయనమః
అధోక్షజాయనమః
ఋతవేనమః ౪౨౦
ఓం సుదర్శనాయనమః
కాలాయనమః
పరమేష్ఠినేనమః
పరిగ్రహాయనమః
ఉగ్రాయనమః
సంవత్సరాయనమః
దక్షాయనమః
విశ్రామాయనమః
విశ్వదక్షిణాయనమః
విస్తారాయనమః ౪౩౦
ఓం స్థావరాయనమః
స్థాణవేనమః
ప్రమాణాయనమః
భీజాయావ్యయాయ
అర్థాయనమః
అనర్థాయనమః
మహాకోశాయనమః
మహాభోగాయనమః
మహాధనాయనమః
అనిర్విణ్ణాయనమః ౪౪౦
ఓం స్థవిష్ఠాయనమః
భువేనమః
ధర్మయూపాయనమః
మహామఖాయనమః
నక్షత్రనేమయే
నక్షత్రిణేనమః
క్షమాయనమః
క్షామాయనమః
సమీహనాయనమః
యజ్ఞాయనమః ౪౫౦
ఓం ఇజ్యాయనమః
మహేజ్యాయనమః
క్రతవేనమః
సత్రాయనమః
సతాంగతయేనమః
సర్వదర్శినేనమః
విముక్తాత్మనేనమః
సర్వజ్ఞాయనమః

జ్ఞానాయనమః
ఉత్తమాయనమః ౪౬౦
ఓం సువ్రతాయనమః
సుముఖాయనమః
సూక్ష్మాయనమః
సుఘోషాయనమః
సుఖదాయనమః
సుహృదేనమః
మనోహరాయనమః
జితక్రోధాయనమః
వీరబాహవేనమః
విదారణాయనమః ౪౭౦
ఓం స్వాపనాయనమః
స్వవశాయనమః
వ్యాపినేనమః
నైకాత్మనేనమః
నైకకర్మకృతేనమః
వత్సరాయనమః
వత్సలాయనమః
వత్సినేనమః
రత్నగర్భాయనమః
ధనేశ్వరాయనమః ౪౮౦
ఓం ధర్మకృతేనమః
ధర్మగుప్తేనమః
ధర్మణేనమః
స్వతేనమః
అసతేనమః
క్షరాయనమః
అక్షరాయనమః
అవిజ్ఞాతేనమః
సహస్రాంశవేనమః
విధాత్రేనమః ౪౯౦
ఓం కృతలక్షణాయనమః
గభస్తినేమయేనమః
సత్త్వస్థాయనమః
సింహాయనమః
భూతమహేశ్వరాయనమః
ఆదిదేవాయనమః
మహాదేవాయనమః
దేవేశాయనమః
దేవభృద్గురవేనమః
ఉత్తరాయనమః ౫౦౦
ఓం గోపతయేనమః
గోప్త్రేనమః
జ్ఞానగమ్యాయనమః
పురాతనాయనమః
శరీరభూతభృతేనమః
భోక్త్రేనమః
కపీంద్రాయనమః
భూరిదక్షిణాయనమః
సోమపాయనమః
అమృతపాయనమః ౫౧౦
ఓం సోమాయనమః
పురుజితేనమః
పురుసత్తమాయనమః
వినయాయనమః
జయాయనమః
సత్యసంధాయనమః

దాశార్హాయనమః
సాత్వతాంపతయేనమః
జీవాయనమః
వినయితాయనమః ౫౨౦
ఓం సాక్షిణేనమః
ముకుందాయనమః
అమితవిక్రమాయనమః
అంభోనిధయేనమః
అనంతాత్మనేనమః
మహోదధిశయాయనమః
అంతకాయనమః
అజాయనమః
మహార్హస్వాభావ్యాయనమః
జితామిత్రాయనమః ౫౩౦
ఓం ప్రమోదనాయనమః
ఆనందాయనమః
నందనాయనమః
నందాయనమః
సత్యధర్మణేనమః
త్రివిక్రమాయనమః
మహర్షయేనమః
కపిలాచార్యాయనమః
కృతజ్ఞాయనమః
మేదినీపతయేనమః ౫౪౦
ఓం త్రిపదాయనమః
త్రిదశాధ్యక్షాయనమః
మహాశృంగాయనమః
కృతాంతాయనమః
కృతేనమః

మహావరాహాయనమః
గోవిందాయనమః
సుషేణాయనమః
కనకాంగదినేనమః
గుహ్యాయనమః ౫౫౦
ఓం గభీరాయనమః
గహనాయనమః
గుప్తాయనమః
చక్రగదాధరాయనమః
వేధసేనమః
స్వాంగాయనమః
అజితాయనమః
కృష్ణాయనమః
దృఢాయనమః
సంకర్షణాయనమః ౫౬౦
ఓం అచ్యుతాయనమః
వరుణాయనమః
వారుణాయనమః
వృక్షాయనమః
పుష్కరాక్షాయనమః
మహామనసేనమః
భగవతేనమః
భగఘ్నేనమః
ఆనందినేనమః
వనమాలినేనమః ౫౭౦
ఓం హలాయుధాయనమః
ఆదిత్యాయనమః
జ్యోతిరాదిత్యాయనమః
సహిష్ణుర్గతిసత్తమాయనమః

సుధన్వనేనమః
ఖండపరశవేనమః
దారుణాయనమః
ద్రవిణప్రదాయనమః
దివిస్పృశేనమః
సర్వదృశేనమః ౫౮౦
ఓం వ్యాసాయనమః
వాచస్పతయేనమః
అయోనిజాయనమః
త్రిసామ్నేనమః
సామగాయనమః
సామ్నేనమః
సర్వాణాయనమః
భేషజాయనమః
భిషజేనమః
సన్న్యాసకృతేనమః ౫౯౦
ఓం సమాయనమః
శాంతాయనమః
నిష్ఠాయనమః
శాంతినేనమః
పరాయణాయనమః
శుభాంగాయనమః
శాంతిదాయనమః
స్రష్ట్రేనమః
కుముదాయనమః
కువలేశాయనమః ౬౦౦
ఓం గోహితాయనమః
గోపతయేనమః
గోప్త్రేనమః

వృషభాక్షాయనమః
వృషప్రియాయనమః
అనివర్తినేనమః
నివృత్తాత్మనేనమః
సంక్షేప్త్రేనమః
క్షేమకృతేనమః
శివాయనమః ౬౧౦
ఓం శ్రీవత్సవక్షసేనమః
శ్రీవాసాయనమః
శ్రీపతయేనమః
శ్రీమతాంవరాయనమః
శ్రీదాయనమః
శ్రీశాయనమః
శ్రీనివాసాయనమః
శ్రీనిధయేనమః
శ్రీవిభావనాయనమః
శ్రీధరాయనమః ౬౨౦
ఓం శ్రీకరాయనమః
శ్రేయసేనమః
శ్రీమతేనమః
లోకత్రయాశ్రయాయనమః
స్వక్షాయనమః
స్వంగాయనమః
శతానందాయనమః
నందినేనమః
జ్యోతిర్గణేశ్వరాయనమః
విజితాత్మనేనమః ౬౩౦
ఓం ధేయాత్మనేనమః
సత్కీర్తయేనమః

ఛిన్నసంశయాయనమః
ఉదీర్ణాయనమః
సర్వతశ్చక్షుషేనమః
అనీశాయనమః
శాశ్వతాయనమః
స్థిరయేనమః
భూశయేనమః
భూషణాయనమః ౬౪౦
ఓం భూతయేనమః
విశోకాయనమః
శోకనాశనాయనమః
అర్చిష్మతేనమః
అర్చితేనమః
కుంభాయనమః
విశుద్ధాత్మనేనమః
విశోధనేనమః
అనిరుద్ధాయనమః
అప్రతిరథయేనమః ౬౫౦
ఓం ప్రద్యుమ్నాయనమః
అమితవిక్రమాయనమః
కాలనేమిఘ్నేనమః
వీరాయనమః
శౌరయేనమః
శూరజనేశ్వరాయనమః
త్రిలోకాత్మనేనమః
త్రిలోకేశాయనమః
కేశవాయనమః
కేశిఘ్నేనమః ౬౬౦
ఓం హరయేనమః

కామదేవాయనమః
కామపాలాయనమః
కామినేనమః
కృతాగమాయనమః
అనిర్దేశ్యాయనమః
వపుషేనమః
విష్ణవేనమః
వీతాయనమః
అనంతాయనమః ౬౭౦
ఓం ధనంజయాయనమః
బ్రహ్మణ్యాయనమః
బ్రహ్మకృతేనమః
బ్రహ్మణేనమః
బ్రహ్మబ్రహ్మవివర్ధనాయ
బ్రహ్మవిదేనమః
బ్రాహ్మణాయనమః
బ్రహ్మిణేనమః
బ్రహ్మజ్ఞాయనమః
బ్రాహ్మణప్రియాయనమః
ఓం మహాక్రమాయనమః ౬౮౦
మహాకర్మణేనమః
మహాతేజసేనమః
మహోరగాయనమః
మహాక్రతవేనమః
మహాయజ్వనేనమః
మహాయజ్ఞాయనమః
మహాహవిషేనమః
స్తవ్యాయనమః
స్తవప్రియాయనమః ౬౯౦

ఓం స్తోత్రాయనమః
నుతియేనమః
స్తోత్రేనమః
గణప్రియాయనమః
పూర్ణాయనమః
పూరయిత్రేనమః
పుణ్యాయనమః
పుణ్యకీర్తయేనమః
అనామయాయనమః
మనోజవాయనమః ౨౦౦
ఓం తీర్థకరాయనమః
వసురేతసేనమః
వసుప్రదాయనమః
వాసుదేవాయనమః
వసుమనసేనమః
హవిషేనమః
సద్గతయేనమః
సత్కృతయేనమః
సత్తాయనమః
సద్భూతయేనమః ౨౧౦
ఓం సత్పరాయణాయనమః
శూరసేనాయనమః
యదుశ్రేష్ఠాయనమః
సన్నివాసాయనమః
సుయామునాయనమః
భూతావాసాయనమః
వాసుదేవాయనమః
సర్వాసునిలయాయనమః
అనలాయనమః

దర్పఘ్నేనమః ౨౨౦
ఓం దర్పదేనమః
అదృప్తాయనమః
దుర్ధరోధాయనమః
అపరాజితాయనమః
విశ్వమూర్తయేనమః
మహామూర్తయేనమః
దీప్తమూర్తయేనమః
అమూర్తిమతేనమః
అనేకమూర్తయేనమః
అవ్యక్తాయనమః ౨౩౦
ఓం శతమూర్తయేనమః
శతాననాయనమః
ఏకస్మైనమః
నైకస్మైనమః
స్థవాయనమః
కాయనమః
కస్మైనమః
యస్మైనమః
తస్మైనమః
పదాయనమః ౨౪౦
ఓం అనుత్తమాయనమః
లోకబంధవేనమః
లోకనాథాయనమః
మాధవాయనమః
భక్తవత్సలాయనమః
సువర్ణవర్ణాయనమః
హేమాంగాయనమః
వరాంగాయనమః

చందనాంగదియేనమః
వీరఘ్నేనమః ౭౫౦
ఓం విషమాయనమః
శూన్యాయనమః
ఘృతాశిషేనమః
అచలాయనమః
చలాయనమః
అమానినేనమః
మానదాయనమః
మాన్యాయనమః
లోకస్వామినేనమః
త్రిలోకధృతేనమః ౭౬౦
ఓం సుమేధసేనమః
మేధజాయనమః
ధన్యాయనమః
సత్యమేధసేనమః
ధరాధరాయనమః
తేజోవృషాయనమః
ద్యుతిధరాయనమః
సర్వశస్త్రభృతాంవరాయన
ప్రగ్రహాయనమః
నిగ్రహాయనమః ౭౭౦
ఓం అవ్యగ్రాయనమః
నైకశృంగాయనమః
గదాగ్రజాయనమః
చతుర్మూర్తయేనమః
చతుర్బాహవేనమః
చతుర్వ్యూహాయనమః
చతుర్గతయేనమః
చతురాత్మనేనమః
చతుర్భావాయనమః
చతుర్వేదవిదేనమః ౭౮౦
ఓం ఏకపదేనమః
సమావర్తాయనమః
నివృత్తాత్మనేనమః
దుర్జయాయనమః
దురతిక్రమాయనమః
దుర్లభాయనమః
దుర్గమాయనమః
దుర్గాయనమః
దురావాసాయనమః
దురారిఘ్నేనమః ౭౯౦
ఓం లోకసారంగాయనమః
సుతంతవేనమః
తంతువర్ధనాయనమః
ఇంద్రకర్మణేనమః
మహాకర్మణేనమః
కృతకర్మణేనమః
కృతాగమాయనమః
ఉద్భవాయనమః
సుంద - యనమః
సుందాయనమః ౮౦౦
ఓం రత్ననాభాయనమః
సులోచనాయనమః
అర్కాయనమః
వాజసనయేనమః
శృంగిణేనమః
జయంతాయనమః

సర్వవిజ్జయినే నమః
సువర్ణబిందవే నమః
అక్షోభ్యాయ నమః
సర్వవాగీశ్వరేశ్వరాయ నమః
ఓం మహాహ్రదాయ నమః [౮౧౦
మహాగర్తాయ నమః
మహాభూతాయ నమః
మహానిధయే నమః
కుందరాయ నమః
కుందాయ నమః
పర్జన్యాయ నమః
పవనాయ నమః
అనిలాయ నమః
అమృతాశాయ నమః ౮౨౦
ఓం అమృతవపుషే నమః
సర్వజ్ఞాయ నమః
సర్వతోముఖాయ నమః
సులభాయ నమః
సువ్రతాయ నమః
సువ్రతాయ నమః
సిద్ధాయ నమః
శత్రుజితే నమః
శత్రుతాపనాయ నమః
న్యగ్రోధోదుంబరాయ నమః
ఓం అశ్వత్థాయ నమః [౮౩౦
చాణూరాంధ్రనిషూధనాయన
సహస్రార్చిషే నమః
సప్తజిహ్వాయ నమః
సప్తైధసే నమః

సప్తవాహనాయ నమః
అమూర్తయే నమః
అనఘాయ నమః
అచింత్యాయ నమః
భయకృతే నమః ౮౪౦
ఓం భయనాశనాయ నమః
అణవే నమః
బృహతే నమః
కృశాయ నమః
స్థూలాయ నమః
గుణభృతే నమః
నిర్గుణాయ నమః
మహతే నమః
అధృతాయ నమః
స్వధృతాయ నమః ౮౫౦
ఓం స్వాస్థ్యాయ నమః
ప్రాగ్వంశాయ నమః
వంశవర్ధనాయ నమః
భారభృతే నమః
కథితాయ నమః
యోగినే నమః
యోగీశాయ నమః
సర్వకామదాయ నమః
ఆశ్రమాయ నమః
శ్రమణాయ నమః ౮౬౦
ఓం సువర్ణాయ నమః
వాయువాహనాయ నమః
ధనుర్ధరాయ నమః
ధనుర్వేదాయ నమః

దండాయనమః
దమయిత్రేనమః
దమాయనమః
అపరాజితాయనమః
సర్వసహాయనమః
నియంత్రేనమః ౮౭౦
ఓం నియమాయనమః
యమాయనమః
సత్త్వవతేనమః
సాత్త్వికాయనమః
సత్యాయనమః
సత్యధర్మపరాయణాయనమః
అభిప్రాయాయనమః
ప్రియార్హాయనమః
అర్హాయనమః
ప్రియకృతేనమః ౮౮౦
ఓం ప్రీతివర్ధనాయనమః
విహాయసగతయేనమః
జ్యోతిషేనమః
సురుచయేనమః
హుతభుగ్విభవేనమః
రవయేనమః
విరోచనాయనమః
సూర్యాయనమః
సవిత్రేనమః
రవిలోచనాయనమః ౮౯౦
ఓం అనంతహుతభుగ్భోక్త్రేనమః
సుఖదాయనమః
నైకదాయనమః
అగ్రజాయనమః
అనిర్విణ్ణాయనమః
సనామర్షిణేనమః
లోకాధిష్ఠానాయనమః
అద్భుతాయనమః
తత్సనాతేనమః
తమాయనమః ౯౦౦
ఓం కపిలానమః
కపయేనమః
అవ్యయాయనమః
స్వస్తిదాయనమః
స్వస్తికృతేనమః
స్వస్తయేనమః
స్వస్తిభుజేనమః
స్వస్తిదక్షిణాయనమః
అరౌద్రాయనమః
కుండలినేనమః ౯౧౦
ఓం చక్రిణేనమః
విక్రమిణేనమః
ఊర్జితశాసనాయనమః
శబ్దాతిగాయనమః
శబ్దసహాయనమః
శిశిరాయనమః
శర్వరీకరాయనమః
అక్రూరాయనమః
పేశలాయనమః
దక్షాయనమః ౯౨౦
ఓం దక్షిణాయనమః
క్షమిణాంవరాయనమః

విద్వత్తమాయనమః
వీతభయాయనమః
పుణ్యశ్రవణకీర్తయనమః
ఉత్తరణాయనమః
దుష్కృతిఘ్నేనమః
పుణ్యాయనమః
దుఃస్వప్ననాశనాయనమః
వీరఘ్నేనమః ౯౩౦
ఓం రక్షణాయనమః
శాంతాయనమః
జీవనాయనమః
పర్యవస్థితాయనమః
అనంతరూపాయనమః
అనంతశ్రియేనమః
జితమన్యవేనమః
భయాపహాయనమః
చతురశ్రాయనమః
గభీరాత్మనేనమః ౯౪౦
ఓం విదిశాయనమః
వ్యాదిశాయనమః
దిశాయనమః
అనాదయేనమః
భూర్భువాయనమః
లక్ష్మ్యైనమః
సువీరాయనమః
రుచిరాంగదాయనమః
జననాయనమః
జనజన్మాదయేనమః ౯౫౦
ఓం భీమాయనమః
భీమపరాక్రమాయనమః
ఆధారనిలయాయనమః
ధాత్రేనమః
పుష్పహాసాయనమః
ప్రజాగరాయనమః
ఊర్ధ్వగాయనమః
సత్పథాచారాయనమః
ప్రాణనాయనమః
ప్రణవాయనమః ౯౬౦
ఓం ప్రణాయనమః
ప్రమాణాయనమః
ప్రాణనిలయాయనమః
ప్రాణభృతేనమః
ప్రాణజీవనాయనమః
తత్త్వాయనమః
తత్త్వవిదేనమః
ఏకాత్మనేనమః
జన్మమృత్యుజరాతిగాయనమః
భూర్భువస్స్వస్తరవేనమః ౯౭౦
ఓం తారాయనమః
ప్రసితామహాయనమః
యజ్ఞపతయేనమః
యజ్వనేనమః
యజ్ఞాంగాయనమః
యజ్ఞవాహనాయనమః
యజ్ఞభృతేనమః
యజ్ఞకృతయేనమః
యజ్ఞినేనమః
యజ్ఞభుజేనమః ౯౮౦

ఓం యజ్ఞసాధనాయనమః
యజ్ఞాంతకృతేనమః
యజ్ఞగుహ్యాయనమః
అన్నదాయనమః
ఆత్మయోనయేనమః
స్వయంజాతాయనమః
వైఖానాయనమః
సామగాయనమః
దేవకీనందనాయనమః
స్రష్ట్రేనమః ౯౯౦

ఓం క్షితీశాయనమః
పాపనాశనాయనమః
శంఖభృతేనమః
నందకినేనమః
చక్రిణేనమః
శార్ఙ్గధన్వినేనమః
గదాధరాయనమః
రథాంగపాణయేనమః
రక్షోభ్యాయనమః
సర్వప్రహరణాయుధాయనమః ౧౦౦౦

శ్రీ విష్ణుసహస్రనామావళిః సమాప్తం

——(o)——



చ. ల. కు. సు. ల.॰ము.